# శ్రీ సౌమ్యనామ సంవత్సర సిద్ధాన్త పంచాఙ్గము

తిరుమల తిరుపతి దేవస్థానముల ప్రచురణము

## 1969-70

శ్రీలక్ష్మీవేంకటేశాయ నమః

# శ్రీ సౌమ్యనామ సంవత్సర

## సిద్ధాన్త పంచాఙ్గము

## 1969-70

తిరుమల తిరుపతి దేవస్థానముల సిద్ధాన్తి వగైరా మిరాశిదార్,
శ్రీమాఞ్ పరవస్తు సిద్ధాన్తి శ్రీనివాసవరదాచార్యులు వారిచే
గణింపబడి




తిరుమల తిరుపతి దేవస్థానముల ఆస్థాన పండితులు
వైయాకరణపంచానన - ఆగమాచార్య - ఆగమ చక్రవర్తి
ఆకులమన్నాడు, శ్రీమాఞ్ పండిత ఆర్. పార్థసారథి అయ్యంగార్లవారిచే సరిచూడబడి

తిరుమల తిరుపతి దేవస్థానముల ఎగ్జిక్యూటివ్ ఆఫీసరువారగు
శ్రీ యం. చంద్రమౌళిరెడ్డి, ఎం.ఏ., ఐ.ఎ.ఎస్. గారిచే ప్రకటింపఁబడినది.

తిరుపతి

1969



తిరుమల శ్రీవేంకటేశ్వరస్వామివారు

శ్రీ ర స్తు

శ్రీలక్ష్మీవేంకటేశః ప్రసన్నో భవతు

శ్రీ శ్రీనివాసాయ పరస్మై బ్రహ్మణే నమః

# శ్రీ సౌమ్యనామ సంవత్సర సిద్ధాన్త పంచాఙ్గ పత్రికా.

శ్లో॥ శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్ । ప్రసన్నవదనం ధ్యాయేత్సర్వవిఘ్నోపశాంతయే ॥

యస్యద్విరదవక్త్రాద్యాః పారిషద్యాః పరశ్శతమ్ । విఘ్నం నిఘ్నంతి సతతం విష్వక్సేనం తమాశ్రయే ॥

శ్రీమాన్ శ్రీశేషపృథ్వీధరశిఖరపరిస్పందిపాదారవింద-

ద్వంద్వో మందీకృతేందుప్రభరుచిరుచిరస్వాననస్సంతనోతు ।

లక్ష్మీం లక్ష్మీవియోగాసహనిజహృదయః కోపి కారుణ్యపూర్ణో

దేవాధీశః ప్రఫుల్లాంబుజదళనయనస్సర్వదా సర్వదో నః ॥

కందర్పకోటిసదృశం కమనీయవేషం ముక్తావళీలలితకంఠముదారహారమ్ ।

పీతాంబరద్యుతివిరాజితదివ్యదేహం శ్రీవేంకటేశవపురాత్మని సన్నిధత్తామ్ ॥

ఈశానాం జగతోఽస్య వేంకటపతేర్విష్ణోః పరాం ప్రేయసీం

తద్వక్షఃస్థలనిత్యవాసరసికాం తత్క్షాంతిసంవర్ధినీమ్ ।

పద్మాలంకృతపాణిపల్లవయుగాం పద్మాసనస్థాం శ్రియం

వాత్సల్యాదిగుణోజ్జ్వలాం భగవతీం వందే జగన్మాతరమ్ ॥

శ్రీవిష్ణుచిత్తకులనందనకల్పవల్లీం శ్రీరంగరాజహరిచందనయోగదృశ్యామ్ ।

సాక్షాత్ క్షమాం కరుణయా కమలామివాన్యాం గోదామనన్యశరణశ్శరణం ప్రపద్యే ।

విశదోర్ధ్వపుండ్రవిలసన్ముఖాంబుజం లలితోపవీతకలితోరువక్షసమ్ ।

కరపద్మవజ్రకలితత్రిదండకం కలయే యతీంద్రకమనీయవిగ్రహమ్ ॥

ఆరోగ్యం పద్మబంధుర్వితరతు సతతం సంపదం శీతరోచిః

భూలాభం భూమిపుత్రస్సకలగుణయుతాం వాగ్విభూతిం చ సౌమ్యః ।

సౌభాగ్యం దేవమంత్రీ వితరతు సతతం భార్గవశ్శౌర్యమార్కిః

ధైర్యం రాహుశ్చ కీర్తిం సకలశుభయుతాం కేతురిష్టార్థసిద్ధిమ్ ॥

అబ్దాదౌ బంధుసంయుక్తో మంగళస్నానమాచరన్ । వస్త్రైరాభరణైర్దేహమలంకృత్య తతశ్శుచిః ॥

శ్రీవేంకటాచలాధీశం శ్రీనిధిం కరుణానిధిమ్ । నమస్కృత్య హృషీకేశం యతిరాజం చ నిత్యశః ॥

సంవత్సరఫలం సమ్యగ్యశ్శృణోత్యేకమానసః । దద్యుర్మనోరథం సర్వం దేవతాః ఫలముత్తమమ్ ॥

జ్యోతిశ్శాస్త్రం మహాపుణ్యం ప్రమాణత్వేన నిశ్చితమ్ ।

చంద్రార్కౌ తత్ర సాక్షిత్వం భజేతే నిశ్చలం యతః ॥

యథా శిఖా మయూరాణాం నాగానాం మణయో యథా ।

తథా వేదాంగశాస్త్రాణాం జ్యోతిషం మూర్ధ్ని సంస్థితమ్ ॥

తిస్రశ్చాయాంగుళీర్యో వహతి విషువతో వేంకటాఖ్యో గిరీంద్రః
తత్ప్రాన్తే శ్రీనగర్యాం విరచితవసతిర్నాథమాసీంద్రపీఠ్యామ్ ।
శ్రీమాన్ పంచాంగమేతత్కలయతి పరవస్త్వన్వయాంభోధిచంద్రః
విద్వాన్ శ్రీ శ్రీనివాసో వరదపదయుతః శ్రీనివాసార్యసూనుః ॥
యేన జ్యోతిషవిదుషా రవిసిద్ధాన్తం సమగ్రమనుసృత్య ।
గణితం పంచాంగమిదం గుణితం విబుధైశ్చిరం జీయాత్ ॥

## అబ్దత్రయనిరూపణమ్

అథాస్మిన్నబ్దే లోకవ్యవహారార్థం చాంద్రమానాబ్దో గ్రాహ్యః । చాంద్రమానేన చైత్రశుక్లప్రతిపత్ బుధవాసరే వత్సరారంభః । శేషాచలస్య దక్షిణదేశే సౌరమానాబ్దో గ్రాహ్యః । సౌరమానేన చైత్ర బ ౧౨ భానువాసరే వత్సరారంభః । చాంద్రసౌరమానాభ్యాం సౌమ్యసంవత్సరః, వింధ్యస్యోత్తరదేశే బార్హస్పత్య మానాబ్దో గ్రాహ్యః । బార్హస్పత్యమానేన దుర్మతిసంవత్సరః సర్వత్ర గురూదయనశాత్ ఫాల్గుణాబ్దః ॥

## అబ్దత్రయఫలమ్

చాంద్ర సౌరమానములచే–సౌమ్య సంవత్సర ఫలం : శ్లో॥ సౌమ్యాబ్దే సుఖినో లోకాః బహు సస్యార్ఘవృష్టిభిః । నిర్వైరిణో ధరాధీశాః విప్రాశ్చాధ్వరతత్పరాః ॥ ప్రజలకు సుఖము కలుగును. సస్యములు, వృష్టి. వెలలు అధికముగ నుండును. దేశ పాలకులు మైత్రి కలిగి యుందురు. బ్రాహ్మణులు యాగములు చేయుదురు.

బార్హస్పత్యమానముచే – దుర్మతి సం॥ర ఫలం : శ్లో॥ దుర్మత్యబ్దే దుర్మతయః భవంత్యఖిల భూమిపాః । తథాపి సుఖినో లోకాః సంగ్రామే నిర్జితారయః ॥ దేశ పాలకులకు దుర్బుద్ధు లధికమగు చుండును. యుద్ధమున జయించిన శత్రువులు గలవారు నగుదురు.

సర్వత్రగురూదయముచే-చైత్రాబ్దఫలం : శ్లో॥ చైత్రాబ్దే భూమిపాః స్వస్థాః క్షోణీ చాల్పఫలప్రదా । సుదుర్లభం చోత్తమాంగం ప్రీతిస్సాధుజనస్య చ ॥ రాజులు స్వస్థతకలిగి యుందురు. భూమి అల్పముగ ఫలించును. సజ్జనప్రేమ యధికము. ఉత్తమాంగము, శిరస్సు బాధారహితముగ నుండును.

## అథ బ్రహ్మాద్యాయుః ప్రమాణనిర్ణయః

శ్రీమద్భగవద్దివ్యనాభీకమలజాతస్య చతుర్ముఖస్య బ్రహ్మణః పరమాయుఃప్రమాణ సౌరాబ్దాః ౩ పద్మములు, మహాఖర్వం ౧, ఖర్వం ౧, న్యర్బుదాని ౧౦, అర్బుదాని ४, బ్రహ్మణోదినప్రమాణ వర్షాణి ४ లక్షల ముప్పైనాలుగువేలు. బ్రహ్మణః పరమాయుర్వర్షశతమ్ ॥ సృష్ట్యాదిగత సౌరాబ్దాః ౧౯౫౫,౮౮౫,౫౦౩౦ - కల్యాదిగతాబ్దాః ౫౦౭౦ - శాలివాహనశకగతాబ్దాః ౧౮౯౧ - విక్రమశకః ౨౦౨४ - హూణశకాబ్దాః 1969. బ్రహ్మణః పరమాయుః పూర్వార్ధం గతమ్ ॥ ఉత్తరపంచాశద్వర్షే ప్రథమమాసే ప్రథమపక్షే ప్రథమదివసే చతుర్దశ ఘటికాః అష్టచత్వారింశద్విఘటికాశ్చ భుక్తాః ॥ వర్తమాన సౌమ్యనామ సంవత్సరస్య శ్రీశైలాది మహేంద్రగిరిమధ్యస్థత్రిలింగదేశస్య రాజాదినవనాయకనిర్ణయః క్రియతే ॥

## శ్రీ సౌమ్యనామ సంవత్సరస్య రాజాది నిర్ణయః

రాజా-బుధః । మంత్రీ-రవిః । సేనాధిపతిపో-రవిః । సస్యాధిపతిః-బుధః । ధాన్యాధిపః-కుజః అర్ఘాధిపో-రవిః । మేఘాధిపో-రవిః । రసాధిపః-శుక్రః । నీరసాధిపో-బుధః । పశుపాలకో-బలరామః । స్థాన సంరక్షకో-యమః । పూర్వ సస్యాధిపతిః-రవిః । మధ్య సస్యాధిపః-శనిః । అంత్యసస్యాధిపః-చంద్రః । పురోహితః-బుధః ॥

శంఖకనామక శ్శేషః, ఉద్వాహనామకో - వాయుః, విద్యుత్‌నామక విద్యుత్ - నిర్ఘోషనామక గర్జితం, క్షీరనామకస్సముద్రః, ద్రోణనామకో మేఘః, మేరోః ప్రాగ్భాగే మేఘోత్పత్తిః, త్ర్యాఢక పరిమితా వృష్టిః. ఏకాఢకపరిమితో వాయుః ॥ ఆఢకము గోపాలహస్తగతమగుటచే అనావృష్టియు, ధరలధికము, దుర్భిక్షము కలుగును.

ఆఢకప్రమాణం : శ్లో॥ విస్తారం సప్తతిశ్చైవ యోజనం చోన్నతం శతం ।
ఆఢకస్య ప్రమాణం తు దేవమానేన గణ్యతే ॥
విభాగః : దశభాగాస్సముద్రేషు షడ్భాగాః పర్వతేషు చ ।
భూమౌ తు భాగాశ్చత్వారో వాసవేన వినిశ్చితమ్ ॥

## నవనాయకఫలమ్

### రాజ్ఞః బుధస్య ఫలమ్

సదాగతిస్సాధ్వసకృత్ప్రజానాం నరాః స్త్రియో వా రతికర్మహీనాః ।
ధారాధరాశ్చాప్యవిముక్తధారాః మధ్యాని సస్యాని భవంతి భూమౌ ॥

తా॥ గాలిభయమెక్కువ. స్త్రీపురుషుల కన్యోన్యముండదు. మేఘములకు తగినంత వర్షముండదు. మధ్య సస్యము కలుగును.

### మంత్రిణః రవేః ఫలమ్

రాజ్ఞామన్యోన్యవైరత్వమనావృష్టిర్నిరంతరం ।
అధర్మనిరతా మర్త్యాః భాస్కరస్య చ మంత్రిత్వే ॥

తా॥ రాజులు పరస్పర విరోధము కలిగియుందురు. ప్రజలు అధర్మయుక్తులగుదురు. అంతట సమానముగ వర్షించదు. అతివృష్టి, అనావృష్టి కలుగును.

### సేనాధిపతేః రవేః ఫలమ్

అన్యోన్యయుద్ధం ధరణీశ్వరాణామల్పాంబుదా వారిధరాస్సవాతాః ।
రక్తాని ధాన్యాని ఫలంతి భూమౌ సేనాధిపత్యే దివసేశ్వరస్య ॥

తా॥ దేశపాలకులకు పరస్పర యుద్ధము కలుగును. మేఘములు వాయుపీడచే కొద్దిగ వర్షించును. రక్తధాన్యములు సమృద్ధిగ ఫలించును.

## సస్యాధిపతేః బుధస్య ఫలమ్

మధ్యవృష్టిర్మందసస్యం మేఘా వాతేన పీడితాః ।
త్రసంతి మనుజా నిత్యం బుధే సస్యాధిపే సతి ॥

తా॥ మధ్యమ వృష్టియు పంట తక్కువయున్ను వాయుపీడిత మేఘములు కలిగి ప్రజలు భయ పీడితులై యుందురు.

## ధాన్యాధిపతేః కుజస్య ఫలమ్

ఫలంతి శూకధాన్యాని కించిద్ధాన్యాని యాని చ ।
రక్తభూమిస్తు ఫలితా భౌమే సస్యాధిపే సతి ॥

తా॥ ముల్లుగల ధాన్యములున్ను స్వల్పధాన్యములును, యెఱ్ఱనిభూమి ధాన్యము బాగా ఫలించును.

## అర్ఘాధిపతేః రవేః ఫలమ్

అనర్ఘమల్పవృష్టిశ్చ ప్రజానాం క్షుద్భయం తథా ।
రాజ్ఞాం పరస్పరక్రోధః సూర్యే చార్ఘపతౌ సతి ॥

తా॥ వెలలు హెచ్చుతగ్గులగుట, వర్షము అంతట ఏకరీతిగా లేకుండుట, అతివృష్టి అనావృష్ట్యాది విపరీతములున్నుప్రజలకు అన్నకొరతయు, ఆకలిబాధకలుగును. దేశపాలకులకు కలహమున్ను కలుగును.

## మేఘాధిపతేః రవేః ఫలమ్

మహద్భయం ఫలం స్వల్పం వర్షం స్యాత్ఖండమంతరే ।
రక్తసస్యం సుఫలితం సూర్యే మేఘాధిపే సతి ॥

తా॥ పంట తక్కువగును. ప్రజలకు భయమధికము. ఖండవృష్టికలిగి యెఱ్ఱధాన్యము ఫలించును. సువృష్టి అంతట కలుగదు.

## రసాధిపతేః శుక్రస్య ఫలమ్

క్షీరాణి సర్వవస్తూని కందమూలఫలాని చ ।
రసానామతివృద్ధిస్స్యాచ్ఛుక్రో యది రసాధిపః ॥

తా॥ క్షీరవస్తువులకు, కందమూల ఫలములకు రసాదులకు వృద్ధికలుగును. రసవస్తువు లధికముగ నుండును.

## నీరసాధిపతేః బుధస్య ఫలమ్

గారుత్మతాదిరత్నాని ధాన్యాని వివిధాని చ ।
సర్వాణి వృద్ధిమాయాంతి బుధే నీరసనాయకే ॥

తా॥ గరుత్మన్మణులు, వివిధ ధాన్యములు, సమృద్ధిగనుండును. అపరధాన్యములు బాగా ఫలించును.

## పశుపాలకుడు బలరాముడు - స్థానసంరక్షకుడు యముడై నందుకు ఫలము

సువృష్టిస్సర్వదేశానాం సర్వసస్యసమృద్ధయః ।
మధ్యదేశే సుభిక్షం చ రామశ్చేత్పశునాయకే ॥

అనర్ఘమల్పవృష్టిశ్చ స్వల్పక్షీరం తథా తృణం ।
పశుపీడాభవేన్నిత్యం యమే తు స్థానరక్షకే ॥

తా॥ సువృష్టి, అన్నిదేశములందు సస్యసమృద్ధి, మధ్యదేశమున సుభిక్షమున్ను అనర్ఘము, అల్పవృష్టి, పశువులకు రోగపీడయున్ను, పశుగ్రాసము తక్కువయున్ను పాలు తక్కువ కలుగును.

## పూర్వ, మధ్య, అంత్య సస్యాధిపతుల ఫలము

తా॥ పూర్వ, మధ్య, సస్యాధిపతులు, రవి శనులైనందున పునాసా (ముదురు) మధ్య సస్యముల కరిష్టము కలిగి తక్కువగా ఫలించును. సకాల వర్షములేక పంటలు తక్కువగును. నీటిపంటలున్ను అర్ధముగ పండును. పైరులకు పురుగు బాధారిష్టము లెక్కువగ నుండును. అంత్య సస్యాధిపతి చంద్రుడైనందున అపరధాన్యములు. పొగాకు, జొన్న. గోధుమ, వగైరా బాగా ఫలించును. పైరుపంట అభివృద్ధిగా నుండును.

## ద్రోణనామక మేఘఫలమ్

నవమేఘముల పక్షమున ద్రోణనామక మేఘము మేరుశిఖరమునకు తూర్పున పుట్టును.

నిరంతరం మహావర్షం మధ్యదేశే మహాజలం ।
అశుభం సర్వలోకానాం ద్రోణమేఘస్య లక్షణమ్ ॥

తా॥ అతివృష్టి అనావృష్ట్యాది విపరీతములున్ను మధ్యదేశమున వర్షాధిక్యతయు, అరణ్యపర్వతములందధిక వృష్టియు, పైరులకు పురుగు బాధయున్ను అంతట ప్రజలకు భయోపద్రవాది పీడలున్ను జీవరాశికి నష్టమున్ను అంతట సువృష్టిలేకుండుటయున్ను కలుగును.

## మేషసంక్రాన్తి ఫలమ్

చైత్ర బ ౧౨ ఆది (13-4-69) ఉదయాది ఘ ౩౦-౩౮ (సా గం 6-6) లకు మేషరాశియందు సూర్యుడు ప్రవేశించుటచే - తిథిఫలం - ఉత్తమ ఫలము, వారఫలం :- దుర్భిక్షప్రదము. అంతట కలహము లెక్కువ. సుభిక్షదుర్భిక్షములు సమానము. కాలఫలం - అతివృష్టిన్ని, అర్ధపంటలున్ను లోకపీడయు. రోగభయ మెక్కువయున్ను కలుగును.

## రవేః ఆర్ద్రాప్రవేశ ఫలమ్

(21-6-69) అధికాషాఢ శు ౬ శని ఉదయాది ఘ ౫౨-౨ (తె గం 2-20) సూర్యుడు ఆర్ద్రయందు ప్రవేశించుటచే- తిథిఫలం :- క్షేమము, సుభిక్షము. వారఫలం :- మందఫలము కలుగును. ధరలకు మందము కలుగును. నక్షత్రఫలం :- శుభప్రదము. యోగఫలం :- శుభఫలములుండును. కరణఫలం :-

సౌఖ్యము, అభివృద్ధికల్గును. లగ్నఫలం :— శుభప్రదము. ఖండవృష్టి కలుగును. మధ్యదేశమున పంట లధికము. కాలఫలం :— పంటలకు వృద్ధి వెల లధికము, సస్యానుకూల వృష్టి, క్షేమము, సుభిక్షము.

భరణ్యాది షణ్మండలఫలం :— అతివృష్టి, అరణ్యపర్వతములం దధికవృష్టిన్ని, జలోపద్రవాది భయమధికము. కొన్నిచోట్ల అతివృ.. కలుగును.

## చంద్రచారఫలములు (యోగపంచకఫలములు)

(1) జ్యేష్ఠ శుక్ల ౧ శనివారఫలం : ప్రజలకు రోగారిష్టత, నష్టము కలుగును. పంటలు మధ్యమముగా ఫలించును. ధరలు సామాన్యముగా నుండును. దేశాధిపతులకు కీడు కల్గును.

(2) ఆషాఢ శు ౯ శుక్రవారఫలం : సుభిక్ష క్షేమారోగ్యములు, సువృష్టి కలుగును.

(3) ఆషాఢ శు ౬ చిత్రానక్షత్రఫలం : అన్ని ధాన్యములు అర్ధముగ ఫలించును. కొన్ని చోట్ల దుర్భిక్షము కలుగును.

(4) ఆషాఢ బ ౧౨ రోహిణీనక్షత్రఫలం : అన్ని సస్యములకు నష్టము కలుగును. వైరులకు పురుగుబాధ కలుగును.

(5) పుష్య బ ౩౦ భృగువాసరఫలం : ధనధాన్యవృద్ధి, ప్రజలకు పీడ కలుగును.

## కుజచారఫలము

ఆర్ద్రాది శ్రావణ బ ౨ ప. పశుపక్షులకు పీడ కలుగును. అల్పవృష్టి, రోగములచే జన నష్టము. తదాది భాద్రపద శు ౧౧ ప. ప్రజలకు రోగబాధ, నష్టము లెక్కువ. బ్రాహ్మణ క్షత్రియులకు నాశనము కలుగును. ధాన్యాదులకు నష్టముకలుగును. అనంతరం ఆశ్వయుజ శు ౨ పర్యంతం మేఘములు, ఆవులు, పయఃపూరితమై జనులు అన్నసమృద్ధికలిగి యుందురు. ఆపైన బ ౬ ప. నువ్వులు, నెయ్యి, మినుములు గిరాకి కల్గును. అటుతర్వాత కార్తీక శు ౧౪ ప. రోగము లధికము-ధాన్యవృద్ధి కలుగును. అధికవృష్టిన్ని కలుగును. అనంతరం మార్గశిర శు ౨ ప. అధిక వృష్టిచే సస్యవృద్ధి, ధాన్యవృద్ధి కలుగును. బెల్లము, శర్కర వృద్ధి యగును. ఆపైన బ ౭ ప. భూమియందు ధాన్యాదులకు పురుగులు, ఎలుకల బాధ విశేషమగును. అటు తర్వాత పుష్య శు ౧౧ ప. నువ్వులు, వెండి, శస్త్రము, ప్రత్తి, దూది పూర్ణముగా ఉండును. వెల లధికము. అనంతరం బ ౩౦ ప. మేఘచలనముండదు. అన్నకొరత కల్గును. తదాది మాఘ బ ౯ ప. జనులకు సౌఖ్యము కలిగి ధాన్యరక్షణ కలుగును. ప్రజలకు రోగము లధికము. ఆపైన ఫాల్గుణ శు ౧౦ ప. ఎండ లధికము. పొట్టు ధాన్యము గిరాకీ కల్గును. అటు తర్వాత వత్సరాంతము ద్విజులకు, గ్రామములకు, పీడ, నష్టములెక్కువ. నాశము కలుగును. ధాన్యాదులు గిరాకీ కలుగును.

కుజవక్రఫలం : వైశాఖ శు ౧౯ మొదలు అధిక ఆషాఢ శు ౧౧ ప. వృశ్చికరాశిలో వక్రించి యుండుటచే దుర్భిక్షము. చోర రోగాగ్నిభయము, రక్తపదార్థములకు గిరాకిన్ని గలుగును. లోహాదులు, పశు పక్షులు, బెల్లము, శర్కర గిరాకి కలుగును.

బుధాస్తమయ ఫలం : జ్యేష్ఠ శు ౨ వృషభమున అస్తమించుటచే పశువులకు రోగ భయము, కష్టము. భాద్రపద శు ౧౧ ఆశ్వయుజ బ ౧౩ తులాస్తమయముచే అన్ని పదార్థములు గిరాకి, మార్గశిర బ ౧౩ మాఘ శు ౧౫ ధనుర్మకరము లందస్తమించుటచే రాజభయము, చోర రోగాగ్ని భయమున్ను వ్యవసాయకులకు నష్టము కలుగును.

బుధోదయఫలం : జ్యేష్ఠ బ ౪ వృషోదయముచే ధాన్యాములకు, భోజనపదార్థములకు పీడ కలుగును. భాద్రపద బ ౧౧ కన్య యందుదయముచే ధాన్యవృద్ధి, సుఖము కలుగును. కార్తీక బ ౧౨ పుష్య శు ౧౪ ధనుస్సునం దుదయించుటచే సుభిక్షము కల్గును. ఫాల్గుణ బ ౨ కుంభమునం దుదయముచే ఎండ, గాలి అధికమగును.

గురుచారఫలం : అబ్దాది కార్తీక శు ౨ ప. కన్యారాశియం దుండుటచే అంతట నష్టకష్టము లధికముగ దుర్భిక్షము, ధాన్య కొరత కల్గును. పశువులకు పీడయును; గోధుమ, వడ్లు, శర్కర, బెల్లము, నూనె, తిలతైలాదులకు గిరాకీ కలుగును. అంతట కలహము లెక్కువ. దేశ పాలకులకు యుద్ధభయము, కలహము లధికమగును. అటు తర్వాత సంవత్సరాంతమువరకు తులయం దుండుటచే ప్రజలకు రోగ భయబాధ లధికము. జననష్టము కలుగును. కొంత ప్రదేశమున ధర లధికమున్ను, కొన్ని చోట్ల తగ్గుట కల్గును. అంతట కలహము లధికము. రాజకీయ బాధ లధికముగా నుండును.

గుర్వస్తోదయఫలములు : భాద్రపద శు ౧౫ కన్యయందు అస్తమించుటచే అన్ని ధాన్యములు సమార్ఘముగా నుండును. జననష్టము, రోగబాధ అధికమున్ను, ఉన్నవారికి క్షేమమున్ను కలుగును. ఆశ్వయుజ శు ౧౩ కన్యయందుదయముచే శిశువులకు, గణికులకు పీడారిష్టము లేర్పడును. కస్తూరి వగైరా గిరాకీ చూపును.

గురువక్రఫలం : అబ్దాది జ్యేష్ఠ శు ౩ ప. కన్యయందు వక్రించి యుండుటచే వ్యాపారమున అదృష్టవంతులకు మాత్రమే లాభించును. మిగతావారికి నష్టకష్టము లధికముగా నుండును.

శుక్రోదయాస్తమయఫలములు : చైత్ర బ ౧ మీనమున అస్తమించుటచే మేఘచలన మధికము. రోగనాశము, లక్ష్మీకటాక్షము, మంగళప్రదము కల్గును. చైత్ర బ ౧౦ కనకద్వారమున ఉదయించుటచే వర్షము మధ్యమము. క్షౌమము, ధాన్యము, నెయ్యి గిరాకీ; ఎనుములకు ఎద్దులకు పీడ కలుగును. బంగారు, వెండి, ప్రత్తి దూదివృద్ధి యధికమగును. మార్గశిర శు ౧౫ రాక్షసగణనక్షత్రమున అస్తమించుటచే హిందూ దేశమున కలహమధికము. దేశ పాలకులకు యుద్ధ భయము. పరరాజ కలహమున్ను. దుర్భిక్షము, ఉత్తరమున నష్టకష్టము లధికము. దక్షిణమున సుఖము కలుగును. మాఘ బ ౮ కనకద్వారమున ఉదయించుటచే సుభిక్షము, పశువులకు నష్టము కలుగును. తిలతైలాదులు, లోహములు ప్రత్తి, దూది గిరాకీ కల్గును.

శుక్రస్యవక్రఫలం : అబ్దాది వైశాఖ శు ౧౫ ప. మీనరాశియందు వక్రించియుండుటచే ధాన్యాదు లన్నిటికి ధర తగ్గియుండును. నెయ్యి, నూనె, తిల తైలాదులు గిరాకీ కలుగును.

శనిచారఫలం : ఈ సంవత్సరమంతా మేషరాశియం దుండుటచే ధనధాన్యాదులకు నష్టమున్ను, ఆవులు మొదలగు పశుజాతికి నష్టము. దేశప్రజలకు కలహము లధికమున్ను, అంతట భయ బాధ లధికము, అరాచకము కల్గియుండును. పరరాజకలహము లధికమగును.

శన్యస్తోదయవక్రఫలములు : చైత్ర శు ౧౪ మేషరాశియం దస్తమించుటచే ప్రజలకు నష్ట కష్టము లధికము. ధాన్యాదులకు గిరాకీ, వైశాఖ బ ౧౧ మేషమున ఉదయించుటచే ప్రజలకు సౌఖ్యము, వర్షము కల్గును. శ్రావణ శు ౮ మొదలు మార్గశిర బ ౧౦ వ. మేషరాశియందు వక్రించి యుండుటచే ప్రజలకు చోర రోగాగ్నిభయము లెక్కువ. ధనధాన్యనష్టము, పశునష్టము, పీడ కలుగును. యుద్ధభయము, రాజకలహము లధికము యుండును.

రాహుకేతుచారఫలములు : అద్దాది నిజ ఆషాఢ శు ౧౧ వ. మీనమున రాహువు, కన్యలో కేతువు వుండుటచే కొన్నిచోట్ల అతివృష్టి, కొన్నిచోట్ల అనావృష్టి కలుగుచుండును. ప్రజలకు దుఃఖము, భయము, నష్టకష్టములున్ను కలుగుచుండును. రాజ్యాంగములందు కలహము లధికము. దేశ పాలకులకు నష్టము, పరస్పర విరోధమున్ను కలుగుచుండును. ఆహారపదార్థములు, ధాన్యము గిరాకి కలుగును.

## శుభముహూర్తాని

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| మార్చినెల | 19 | చైత్ర | శు | ౧ | బుధ | రేవతి | వ్యాపారం | వృష | ప | 10 9 |
| | 28 | ,, | | ౧౦ | శుక్ర | పుష్య | ,, | మిథున | | 12 24 |
| ఏప్రెల్ నెల | 23 | వైశాఖ | శు | ౬ | బుధ | పున | ,, | ,, | | 10 44 |
| | 27 | ,, | ,, | ౧౦ | ఆది | మఘ | వివాహాదులు | కటకం | | 11 25 |
| | 30 | ,, | ,, | ౧౩ | బుధ | హ | ,, | ,, | | 11 12 |
| మేనెల | 8 | ,, | బ | ౭ | గురు | శ్రవ | ,, | ,, | | 10 44 |
| | 29 | జ్యేష్ఠ | శు | ౧౩ | గురు | స్వాతి | ,, | ,, | | 9 20 |
| జూన్ నెల | 4 | ,, | బ | ౪ | బుధ | ఉ-షా | ,, | ,, | | 8 54 |
| | 6 | ,, | బ | ౬ | శుక్ర | శ-భి | ,, | సింహం | | 11 47 |
| జూలై నెల | 23 | నిజాషాఢ | శు | ౯ | బుధ | స్వాతి | ,, | ,, | | 8 53 |
| | 31 | ,, | బ | ౩ | గురు | శత | ,, | ,, | | 8 22 |
| ఆగస్టునెల | 7 | ,, | బ | ౧౦ | గురు | రోహి | ,, | ,, | | 7 56 |

ఈ సంవత్సరము సరియైన బలముగల ముహూర్తములు లేనందున సామాన్య ముహూర్తము లను వున్నంతలో చూపియున్నాము. ఏ లగ్నము చూచినను, పాపగ్రహ సంబంధ వీక్షణాదుల చేత, సరియగు బలముగల ముహూర్తములులేవు. గృహారంభ గృహప్రవేశాదులకును, ఉపనయన గర్భా ధానములకు సామాన్య బలముగల ముహూర్తమే కావించవదు.

## అథ కందాయఫలమ్

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| అశ్వి | భర | కృత్తి | రో | మృ | ఆర్ద్ర | పున | పుష్య | ఆశ్లే |
| ౬ | ౧ | ౪ | ౭ | ౨ | ౫ | ౦ | ౩ | ౬ |
| ౧ | ౨ | ౦ | ౧ | ౨ | ౦ | ౧ | ౨ | ౦ |
| ౪ | ౨ | ౦ | ౩ | ౧ | ౪ | ౨ | ౦ | ౩ |
| మఖ | పుబ్బ | ఉత్తర | హస్త | చిత్త | స్వా | విశా | అనూ | జ్యే |
| ౧ | ౪ | ౭ | ౨ | ౫ | ౦ | ౩ | ౬ | ౧ |
| ౧ | ౨ | ౦ | ౧ | ౨ | ౦ | ౧ | ౨ | ౦ |
| ౧ | ౪ | ౨ | ౦ | ౩ | ౧ | ౪ | ౨ | ౦ |
| మూ | పూ-షా | ఉ-షా | శ్ర | ధని | శత | పూ-భా | ఉ-భా | రేవ |
| ౪ | ౭ | ౨ | ౫ | ౦ | ౩ | ౬ | ౧ | ౪ |
| ౧ | ౨ | ౦ | ౧ | ౨ | ౦ | ౧ | ౨ | ౦ |
| ౩ | ౧ | ౪ | ౨ | ౦ | ౨ | ౧ | ౪ | ౨ |

ఒక్కొక్క కందాయఫలము నాల్గు మాసములకు వర్తించును. మొదటి కందాయములో సున్న యున్న మహావ్యాధి, రెండవదానిలో సున్న యున్న మనోవ్యాకులత, మూడవదానిలో సున్న యున్న స్వల్ప ఫలము, మూడుకందాయములు కలిపిన బేసిసంఖ్య అయినచో అర్ధ లాభము, సమసంఖ్య అయినచో సమ ఫలము, మూడు కందాయములందు సున్న యున్నచో నానావిధ కష్టనష్టములు కలుగును.

## ఆదాయ వ్యయౌ

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| మేషవృశ్చికయోః | ఆ. | ౫ | వ్య. | ౫ | సింహస్య | ఆ. | ౧౪ | వ్య. | ౨ |
| వృషభతులయోః | ,, | ౧౪ | ,, | ౧౧ | ధనుర్మీనయోః | ,, | ౮ | ,, | ౧౧ |
| మిథునకన్యయోః | ,, | ౨ | ,, | ౧౧ | మకరకుంభయోః | ,, | ౧౧ | ,, | ౫ |
| కటకస్య | ,, | ౧౧ | ,, | ౮ | సర్వాదాయవ్యయౌ | ,, | ౬౫ | ,, | ౫౩. |

## రాజపూజ్యావమానాని

| | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| మేషస్య | పూ. | ౩ | అ. | ౧ | సింహస్య | పూ. | ౧ | అ. | ౭ | ధనుషః | పూ. | ౬ | అ. | ౩ |
| వృషస్య | ,, | ౬ | ,, | ౧ | కన్యాయాః | ,, | ౪ | ,, | ౭ | మకరస్య | ,, | ౨ | ,, | ౬ |
| మిథునస్య | ,, | ౨ | ,, | ౪ | తులాయాః | ,, | ౯ | ,, | ౭ | కుంభస్య | ,, | ౫ | ,, | ౬ |
| కటకస్య | ,, | ౫ | ,, | ౪ | వృశ్చికస్య | ,, | ౩ | ,, | ౩ | మీనస్య | ,, | ౧ | ,, | ౨ |

## మౌఢ్యనిర్ణయము

(3–4–69) చైత్ర బ ౧ గురువారం మొదలు (11–4–69) చైత్ర బ ౧౦ శుక్రవారం వరకు పశ్చాదస్తమిత శుక్ర మౌఢ్యము (25–9–69) భాద్రపద శు ౧౫ గురువారం మొదలు (23–10–69) ఆశ్వయుజ శు ౧౩ గురువారం వరకు పశ్చాదస్తమిత గురుమౌఢ్యము (23–12–69) మార్గశిర శు ౧౫ మంగళవారం మొదలు (1–3–70) మాఘ బ ౮ ఆదివారం వరకు ప్రాగస్తమిత శుక్రమౌఢ్యము.

## కర్తరీ నిర్ణయః

(4–5–69) వైశాఖ బ ౨ ఆదివారం మొదలు (28–5–69) జ్యేష్ఠ శు ౧౨ బుధవారం వరకు కర్తరి గాన యీ దినములలో గృహారంభ గృహప్రవేశాదులు, గోడ కట్టుట, ఇంటికప్పు యజ్ఞము, క్రయ విక్రయ వ్యాపారము, నూతన వస్త్రధారణ, కర్రపని, వృక్షచ్ఛేదన, భూ ఖాతము చేయుట పనికిరాదు.

## పుష్కర నిర్ణయః

(10–11–1969) కార్తిక శుద్ధ సోమవారం ఉదయాది ఘడియలు ४३-२१ తులారాశియందు గురువు ప్రవేశించుటచే మరుదినము (11–11–69) కార్తిక శు ౨ మంగళవారం ఉదయాది కావేరి నది పుష్కరారంభము.

## సౌరార్ఘవిచారః

మేష, వృశ్చిక, ధనుర్మకర, కుంభమాసములు సమార్ఘము. మిథున, కటక, సింహ, తులా మీన మాసములు శూన్యార్ఘము. వృషభ కన్యామాసము అత్యర్ఘము.

## చంద్రార్ఘలు

చైత్ర, శ్రావణ, భాద్రపద, కార్తీక, మార్గ, పుష్య ఫాల్గుణములు సః ఆషాఢ, నిజాషాఢ, ఆశ్వయుజ మాఘములు శూన్యార్ఘము. జ్యేష్ఠమాసమత్యర్ఘ

## అథ వర్షధాన్యాదయః

వర్షం ౧౧, ధాన్యం ౧౭, శీతం ౧౩, తృణం ౧౩, ఉష్ణం ౧౩, మారుతం ౭, ప్రజావృ ౧౫, తన్నాశః ౧౫, రాజవిద్వరం ౧౧, ఉగ్రం ౫, పుణ్యం ౫, పాపం ౫, వ్యాధి ౧౯, ఉపశమనం ౯, ఆచారః ౫, అనాచారః ౧౩, జన్మాని ౫, మరణాని ౯, దేశోపద్రవం ౭, దేశస్వాస్థ్యం ౯, చోర భయం ౯, తన్నాశః ౫, అగ్నిభయం ౩, శాంతి ౧౭, మృగోపద్రవం ౧౫, మృగక్షయం ౧౫, కీటక భయం ౧౯, తన్నాశః ౧౧, మూషకవృద్ధి ౯, తన్నాశః ౧౫, సర్వోపద్రవం ౧౩, తన్నాశః ౩, కామః ౧౫, లోభః ౫, మోహః ౭, మదః ౧౭, మాత్సర్యం ౯, సుఖం ౧౫, దుఃఖం ౧౯, భోగః ౩, విడంబం ౧౯, మనోవేగః ౧౭, ద్వేషః ౧౩, ప్రతిష్ఠ ౭, అప్రతిష్ఠ ౧౭, ద్యూతం ౯, మత్తత ౧౭, పురుషోత్పత్తి ౭, స్త్రీ ఉత్పత్తి ౧౩, ధాతువృద్ధి ౧౯, భయం ౭, శౌర్యం ౧౧, దుష్టనిగ్రహః ౧౫, శిష్టపాలనం ౧౯, సత్యం ౫, అసత్యం ౩, విశ్వాసః ౯, అవిశ్వాసః ౧౧, దయా ౧౩, నిర్దయా ౧౫, న్యాయం ౧౭,

అన్యాయం ౧౯, సస్యవృద్ధి ౬, తన్నాశః ౬, పశువృద్ధి ౮ తన్నాశః ౪ శుకవృద్ధి ౫, తన్నాశః ౭; ద్రుమకీటవృద్ధి ౮, తన్నాశః ౮, క్షుధా ౯, తృష్ణా ౩, ఆలస్యం ౩, ఉద్యోగం ౧౩, శాంతం ౩, క్రోధం ౩, దంభం ౩, మిత్రభేదః ౧, ఇష్టత ౧౩, రసనిష్పత్తి ౭, ఫలనిష్పత్తి ౧౧, ఉత్సాహః ౯, జ్ఞానం ౫, అజ్ఞానం ౭, కాపట్యం ౧౩, నిష్కాపట్యం ౯, ధర్మః ౧౭, అధర్మవృద్ధి ౧, గోమాయువృద్ధి ౧౦,౧౩ తన్నాశః ౭, సస్యకీటవృద్ధి ౧, తన్నాశః ౧౩, శలభవృద్ధి ౧. తన్నాశః ౪. మశకవృద్ధి ౩, తన్నాశః ౪, మత్కుణవృద్ధి ౧౦, తన్నాశః ౧౩, వృశ్చికవృద్ధి ౧, తన్నాశః ౧౦, వ్యాఘ్రవృద్ధి ౧౩, తన్నాశః ౧౦, పక్షివృద్ధి ౫, తన్నాశః ౫, ధేనువృద్ధి ౨, తన్నాశః ౧, మహిషవృద్ధి ౫, తన్నాశః ౧, మృగవృద్ధి ౩, తన్నాశః ౪, ఛాగవృద్ధి ౨, తన్నాశః ౨, అశ్వవృద్ధి ౩, తన్నాశః ౨, గజవృద్ధి ౪, తన్నాశః ౪, ఉష్ట్రవృద్ధి ౫. తన్నాశః ౫, విప్రవృద్ధి ౧, తన్నాశః ౪, క్షత్రవృద్ధి ౨, తన్నాశః ౫, వైశ్యవృద్ధి ౫, తన్నాశః ౨, శూద్రవృద్ధి ౧, తన్నాశః ౩, మ్లేచ్ఛవృద్ధి ౪, తన్నాశః ౪, సంకరవృద్ధి ౩, తన్నాశః ౧, నవరత్నవృద్ధి ౩, తన్నాశః ౫, మరకతవృద్ధి ౨, మాణిక్యవృద్ధి ౩, వజ్రవృద్ధి ౪, వైడూర్యవృద్ధి ౫, పుష్యరాగవృద్ధి ౧, ఇంద్రనీలవృద్ధి ౧, ప్రవాళం ౧, మౌక్తికం ౧, ఇతరరత్నాని ౧, సువర్ణం ౬, రజత వృద్ధి ౨, తామ్రవృద్ధి ౧౦, కాంస్యం ౬, లోహం ౦, అయః ౮, త్రపు. ౧౦, వ్రీహివృద్ధి ౧౪, శాలివృద్ధి ౧౦. కుళుద్ధవృద్ధి ౨, తిలవృద్ధి ౪, మాషవృద్ధి ౬, ముద్గవృద్ధి ౧౪, సర్షపవృద్ధి ౪, చణక వృద్ధి ౧౦, ఆఢకవృద్ధి ౪, గోధుమవృద్ధి ౧౨, కోద్రవవృద్ధి ౪. ప్రియంగువృద్ధి ౧౦, యావనాళవృద్ధి ౧౨, శ్యామాకవృద్ధి ౬, రాజమాష ౧౪, నీవార ౧౬, శింబి ౧౨, పనస ౧౩, నారికేళ ౧౦, మాతులుంగ ౧౬, జంబీర ౨౫, ఖర్జూర ౨౨, రంభా ౧౯, చూత ౭, కపిత్థ ౧౯. తింత్రిణీ ౨౫, ధాత్రి ౧. అతివృష్టి ౧౭, అనావృష్టి ౫, మూషకవృద్ధి ౫, శలభవృద్ధి ౫, శుకవృద్ధి ౩, స్వచక్రభయం ౧౧, పరచక్రభయం ౭, స్వప్నం ౫, సుషుప్తి ౨, జాగ్రత ౧౦, పైశున్యం ౬, క్రోధం ౦, సంగమం ౮, జ్ఞానం ౧౦, అజ్ఞానం ౧౦, భక్తి ౧౦, ధ్యానం ౦, ఆదంభం ౧౧, జరాయుజం ౧౭, స్వేదజం ౧౩, ఉద్భి ౫, జంగమం ౧౩, విద్యుత్ ౧, శిలాపాతం ౩, గర్జితం ౩. సీసం ౧౦, రసవృ ౬.

ఏవమాలోద్య అస్మిన్ వత్సరే దశాంశఫలం నిర్ణేతవ్యః.

## అథ మకరసంక్రాన్తి ఫలమ్

(14-1-1970) పుష్య శు॥ ౭ బుధవారం ఉదయాది ౫-౫౬ (ఉ॥ గం. 8-55) లకు సూర్యుడు మకరప్రవేశమైనందుకు ఫలము.

సంక్రాంతిపురుషలక్షణము : ద్విముఖం కృష్ణవర్ణం చ కురూపం చ త్రినేత్రకం ।
సప్తబాహుం ద్విపాదం చ శీర్షన్మహిష వాహనమ్ ॥
సప్తాయుధకరం పూజ్యం రూపం సంక్రమణే స్మృతమ్ ।
అష్టవక్త్రో విశాలాక్షో లంబభ్రూః దీర్ఘ నాసికః ॥
శతయోజనమౌన్నత్యం విస్తీర్ణం ద్వాదశస్మృతమ్ ।
ఏవం రూపం సువిజ్ఞేయం సంక్రాంతిపురుష్య హి ॥

సంక్రమపురుషునికి — మందాకిని నామధేయము. మూడు తలలు, రెండు ముఖములు, నాలుగు నోళ్ళు, మూడు కాళ్ళు, చేట చెవులు, పెద్ద కనుబొమ్మలు, పొడవైన ముక్కు, ఎనిమిది చేతులు, రెండు కాళ్ళు కలిగి, నల్లని వికృతాకారము కలిగి యుండును. నూరు యోజనములు ( 800 మైళ్ళు ) ఎత్తు, పన్నెండు యోజనముల లావు కలిగియున్న శరీరము కలవాడు. ఈ పురుషునికి మందాకిని నామమగుటచే రాజుల కరిష్టము, యుద్ధ భయము, కుంకుమస్నానముచే శుభప్రదము. కంబళవస్త్రధారణచే మునులకు నష్టము.

వసాగంధలేపనముచే—విషనాశము, నల్లకలువపుష్పముచే—ఫలనాశకరము, పగడముల ఆభరణముచే — దుష్టనాశనము, శిష్టరక్షణ కలుగును. తగరపు పాత్రయందు భక్షించుటచే — రోగము లధికము, నష్టము కలుగును. పెరుగు త్రాగుటచే చోరులకు నష్టము, తోమర ఆయుధము ధరించుటచే — యుద్ధప్రదము, భయము కలుగును. నెమలికన్నుల గొడుగు ధరించుటచే — మరణమును తగ్గించును. త్రాసు ధరించుటచే పెద్దపులుల నష్టము, మహిషము నెక్కుటచే మహిషనాశమగును. లోలముఖము కలవాడైనందున వర్షము లేకుండుట, అకాల పెలన భయము కలుగును. కూర్చుండి యుండుటచే సస్యములకు వృద్ధి కలుగును. దూది, బొబ్బర్లు, అనప, కాకర, బొమ్మలకు మాలతీ, మొగలి పుష్పములు, గగ్గులులకు, పసుపురంగు, తెలుపు ఎరుపు ధాన్యములు, చిత్రవస్త్రాది వస్త్రములకు, కౌస్తుభాది మణులకు వెల లధికమున్ను, సువృష్టి కలుగును. వాయువ్యదిక్కున వెళ్ళుటచే ఉత్తర వాయువ్యదేశముల కరిష్టము.

పక్షఫలం : మకరసంక్రమణము శుక్లపక్షమునందగుటచే — లోకము హాహాకారములచే దుర్భిక్షక్షామములు కలిగియుండును, జంతువులకు రోగము కలుగును.

తిథిఫలం : రోగ నాశము, క్షేమము కల్గును.

వారఫలం : సుభిక్ష క్షేమారోగ్యములు, సువృష్టి, సస్యసంపద కలుగును.

కాలఫలం : దేశపాలకులకు నష్టము.

లగ్నఫలం : పరిపూర్ణ ధాత్రి కల్గును.

ముహూర్తఫలం ; ఆడంబరవృద్ధిన్ని కలుగును.

సంక్రమపురుషునిచే ధరించబడిన వస్తుజాతము వృద్ధికరము గానందున, యా వస్తువు లా సంవత్సరమున త్యజించవలెను.

(14—1—1970) పుష్య శు బుధవారం ఉదయం గం॥ 8-55 లకు సూర్యుడు మకరమున ప్రవేశించును. ప్రవేశాది ఉత్తరాయణ పుణ్యకాలము గాన ఆ సమయమున సంక్రమణసంబంధమగు స్నాన దాన వ్రత శ్రాద్ధాదులు ఆచరించవలెను. కూశ్మాండ (గుమ్మడికాయ) దానము చేయుట ముఖ్యము.

## పంచాంగములందు వ్రాయబడెడి పంచాంగాంగపంచకమున సంకేతాక్షరముల వివరణము

1. **వారములు :** ఆది, సోమ, మంగళ, బుధ, గురు, శుక్ర, శనివారములు.

2. **తిథులు ౧౫ :** ప్రతిపత్తు (ప్రథమ పాడ్యమి) ద్వితీయ (విదియ) తృతీయ (తదియ) చవితి, పంచమీ షష్ఠి, సప్తమి, అష్టమి, నవమి, దశమి, ఏకాదశి, ద్వాదశి, త్రయోదశి, చతుర్దశి, ○ పూర్ణిమ (శుక్లపక్షమందు) ● అమావాస్య (కృష్ణపక్షమందు.)

3. నక్షత్రములు ౨౭ : అశ్విని, భరణి, కృత్తిక, రోహిణి, మృగశిర, ఆర్ద్ర, పునర్వసు, పుష్యమి, ఆశ్రేష, మఘ, పూర్వఫల్గుని (పూ-ఫ) ఉత్తరఫల్గుని (ఉ-ఫ) హస్త, చిత్త, స్వాతి, విశాఖ, అనూరాధ, జ్యేష్ఠ, మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ, శ్రవణం, ధనిష్ఠ, శతభిషం, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర, రేవతి.

4. యోగములు ౨౭ : విష్కంభము, ప్రీతి, ఆయుష్మాన్, సౌభాగ్యము, శోభనము, అతిగండము, సుకర్మము, ధృతి, శూలము, గండము, వృద్ధి, ధ్రువము, వ్యాఘాతము, హర్షము, వజ్రము, సిద్ధి, వ్యతీపాతము, వరీయాన్, పరిఘము, శివము, సిద్ధము, సాధ్యము, శుభము, శుక్రము, పరమము, ఐంద్రము, వైధృతి.

5. కిరణములు ౧౧ : బవ, బాలవ, కౌలవ, తైతుల, గరజి, వణజి, భద్రము, శకుని, చతుష్పాత్తు, నాగవము, కింస్తుఘ్నము.

ఇట్లు తిథి వార నక్షత్రయోగకిరణములను నైదంగములతో కూడిన పుస్తకమునే మనము పంచాంగమని వ్యవహరించుచున్నారము.

## 1. సంవత్సరఫలమును చూచుట

శ్లో॥ చైత్రాదితిథివారర్క్షం యోగం కిరణసంయుతమ్ । జన్మనక్షత్ర సంయుక్తం సప్తభిర్భాగమాహరేత్ ॥
అర్థలాభం మనస్తాపం రాజమానం చ యుద్ధతః । భూషణం రోగమాయుష్యం సంవత్సరఫలం లభేత్ ॥

తా॥ తెలుగు సంవత్సరాదినాటి తిథి వారము నక్షత్రము యోగము కిరణము వీటి సంఖ్యను జన్మనక్షత్రసంఖ్యతో కూడి ౭ చే భాగించగా వచ్చిన శేషము ౧ అర్థలాభము, ౨ మనస్తాపము, ౩ రాజపూజ్యత, ౪ యుద్ధము, ౫ భూషణము, ౬ రోగము, ౭ ఆయుష్యము ఇవి సంవత్సర ఫలములుగా తెలియునది.

## 2. మాసఫలము

శ్లో॥ శుక్లాది తారమారభ్య జన్మభాంతం చ గణ్యతే ।
నవసంఖ్యాహరేచ్ఛేషం మాసి మాసఫలం స్మృతమ్ ॥

తా॥ శుక్లపక్షపాడ్యమియొక్క ప్రవేశమునందు యే నక్షత్రముందునో ఆ నక్షత్రము మొదలుకొని జన్మ క్షత్రమువరకు లెక్కించి అయిన సంఖ్యను తొమ్మిదిచే భాగింపగా మిగిలిన సంఖ్యకు క్రింది శ్లోకములోని ఫలములు మాసఫలములని తాత్పర్యము.

శ్లో॥ పంథాః సుభోజ్యం తనుతాపశౌర్యే విద్యా చ వస్త్రం విపులం చ శోకమ్ ।
అనంతపుణ్యం చ మహాఫలం చ నవేతి మాసస్య ఫలాని చాహుః ॥

తా॥ ౧ త్రోవనడచుట, ౨ మంచిభోజనము, ౩ శరీరసంతాపము, ౪ శౌర్యము, ౫ విద్యాలాభము ౬ వస్త్రలాభము, ౭ దుఃఖాధిక్యము, ౮ అనంతపుణ్యము, ౯ విశేషఫలము. ఈ పైచెప్పిన ౯ మాసఫలము.

## 3. దినఫలము

దినఫలము॥ జన్మనక్షత్రము మొదలు దిన నక్షత్రమువరకు ఆదివారము మొదలు నాటివారము వరకును యెంచి వచ్చినలెక్కను ౯ తో భాగించగా, శేషము ౧ వ్యాకులము, ౨ శుభం, ౩ క్రూరము, ౪ బంధుదర్శనము, ౫ స్త్రీ సంభోగము, ౬ శుభము, ౭ కలహము, ౮ రోగము, ౯ మంచిమాటలు కలుగును.

## 4. వాస్తుపురుష లక్షణము

భాద్రపదాశ్వయుజ కార్తికమాసములయందు పూర్వశిరస్సుగాను, మార్గశిర పుష్య మాఘమాసములయందు యామ్యశిరస్సుగాను, ఫాల్గున చైత్రవైశాఖమాసములయందు పశ్చిమ శిరస్సుగాను, జ్యేష్ఠాషాఢ శ్రావణమాసములయందు ఉత్తర శిరస్సుగాను వాస్తుపురుషుడు వామహస్తమును తలక్రిందనుంచుకొని పవళించి యుండును. గనుక ఆతనిదృష్టి ప్రచారదిశలయందును పాదములుండుదిక్కునను గృహమును కట్టరాదు.

## 5. జన్మలగ్నమును తెలిసికొనుట

శ్లో॥ చంద్రలగ్నాధిపో యత్ర తత్త్రికోణమథాపి వా ।
తత్సప్తమత్రికోణం వా ఇతి లగ్నస్య నిర్ణయః ॥

తా॥ చంద్రలగ్నమునకు చంద్రుడున్న రాశ్యధిపతి యెక్కడ నుండునో అదిమొదలు ౧-౫-౯ జన్మలగ్నము, అటుగాపోతే ౩-౭-౧౧ జన్మలగ్నము కావలెను.

## 6. జన్మనక్షత్రము తెలిసికొనుట

కేరళరహస్యే॥ శ్లో॥ పృచ్ఛకస్య తు లగ్నం తు వేదఘ్నం నాడిసంయుతమ్ ।
చరేషు పంచభిర్యుక్తం స్థిరేషు దశభిర్యుతమ్ ॥

ద్విస్వభావే సప్తయుక్తం సప్తవింశతిభాజితమ్ ।
శేషం తు జన్మనక్షత్రమిత్యుక్తం కాలకోవిదైః ॥

తా॥ ప్రశ్నలగ్నమును ౪ తో పెంచి, అప్పటికైన ఘటికలను కూడి, చరరాశికి ౫ న్ను, స్థిరరాశికి ౧౦న్ను, ద్విస్వభావరాశికి ౭ న్ను కూడి, ౨౭ తో భాగించగా వచ్చిన శేషము జన్మనక్షత్రమని తెలియవలెను.

## 7. స్త్రీ పురుషాదివివేక గర్భప్రశ్న

శ్లో॥ లగ్నాద్భాగ్య కళత్ర పుత్ర సహజేష్వర్కార జీవాః స్థితాః
చేత్పుత్రం ధనమాతృరంధ్ర రిపుగౌ చేచ్చంద్రశుక్రౌ వధూమ్ ।

తేష్వర్కీందుసుతౌ నపుంసకమితి ద్వ్యాత్మవలగ్నే యది
పృచ్ఛేత్తజ్జననీగృహే భగయుగం చేద్యుగ్మగర్భం వదేత్ ॥

తా॥ ప్రశ్నకాలీన లగ్నమునకు ౬, ౭, ౫, ౩ స్థానములయందు రవ్యంగారక గురువులున్న యెడల పురుష శిశువు గలుగుననియు, ఆ ప్రశ్నలగ్నమునకు ౨, ౪, ౯, ౮ స్థానములయందు శుక్రచంద్రులుండి రేని స్త్రీ శిశువు గలుగుననియు ఈ స్థానములయందే శనిబుధులున్నయెడల నపుంసకుండనియును, ప్రశ్నలగ్నము ద్విస్వభావలగ్నమై యీలగ్నమునకు నాల్గవస్థానమునందు రెండుగ్రహము లున్నయెడల కవలబిడ్డలు పుట్టుదురనియు తాత్పర్యము.

## జననశాంతి నక్షత్రములు

ఉత్తర ౧ పాదము, పుష్యమి ౨, ౩ పాదములు, పూర్వాషాఢ ౩ పాదము, చిత్త ౧, ౨ పాదములు ఆశ్లేష ౪ పాదము, మఘ ౧ పాదము, జ్యేష్ఠ ౪ పాదము, మూల ౧ పాదము, రేవతి ౨, ౩, ౪, పాదములు, అశ్విని ౨, ౩ పాదములు, యీ నక్షత్రములలో శిశువు జన్మించిన యెడల శాంతిని చేసికొనవలయును గ్రంథాంతరమందు, విశాఖ రోహిణీలకు గూడ శాంతి చెప్పబడినది. మాతృపితృభ్రాతల నక్షత్రమైనను వారి వేష్టనమైనను కూడ శాంతి ముఖ్యకర్తవ్యము

## వర్షములను తెలిసికొనుట.

మృగశిర కార్తిలో వర్షమున్ను, మఖకార్తిలో ఉరుమున్ను, స్వాతికార్తిలో మెరుపున్ను కలిగితే ఆసంవత్సరము చక్కగా వర్షించును. శ్రావణమాసమునందు చిత్త-స్వాతి-విశాఖా ఈ నక్షత్రములయందు చినుకులుపడితే ఆ సంవత్సరము చక్కగా వర్షించును

## తేదివానలు

ఆని ౧౦ ఆడి ౮ ఆవణి ౬ పెరటాశి ౪ అల్పిశి ౨ కార్తికె ౧ తేదీలలో చినుకులు పడితే ఆ సంవత్సరము చక్కగా వర్షించును.

## సుభిక్షదుర్భిక్షములను దెలిసికొనుట.

చూడవలసిన సంవత్సరమునకు ప్రభవాదిగా యెంచి ఆసంఖ్యను ద్విగుణించి అందులో ౩ ను తీసి మిగిలినదానిని యేడింటభాగించగా మిగిలిన శేషము ౧, ౪ సుభిక్షము ౨, ౫ దుర్భిక్షము ౩ అయితే సమము శూన్యంబైతే శూన్యము.

## వివాహచక్రలక్షణము

శ్లో॥ ఊర్ధ్వరేఖాస్తు చత్వారి తిర్యగ్రేఖాస్తథావధి ।
లిఖిత్వా మధ్యకోష్ఠాది నవకోష్ఠేషు భానుభాత్ ।
నిత్యనక్షత్రపర్యంతం త్రీణి త్రీణి క్రమాల్లిఖేత్ ॥

## ఏతత్ఫలమ్

మధ్యకోష్ఠస్థితం ఋక్షం హంతి సద్యో వధూవరౌ । ప్రాచ్యాం శుభఫలం దద్యాదాగ్నేయ్యాం పుత్రహీనతామ్ కరోతి యామ్యే వైధవ్యం నైఋత్యాం భాగ్యవర్ధనం । పశ్చిమే మరణం కుర్యాద్వాయవ్యాం వ్యభిచారిణీమ్ ఉత్తరే తు ధనం ధాన్య మీశాన్యే సర్వసంపదః । ఏవం వివాహచక్రస్య ఫలం జ్ఞేయం బుధోత్తమైః ॥

## సంవత్సరదశాఫలమ్.

వర్షదశ తెచ్చుటకు అశ్విన్యాది జన్మనక్షత్రమువరకు యెంచి ఆ సంఖ్యను గతాబ్దసంఖ్యతో కూడా చేర్చి మొత్తముచేసి అందులో ౨ తీసి మిగతను ౯ తో భాగించిన శేషము ౧ మిగిలితే సూర్యదశ, ౨ చంద్ర, ౩ కుజ, ౪ రాహు, ౫ గురు, ౬ శని, ౭ బుధ, ౮ కేతు, ౯ శుక్ర దశయగును. దశాప్రమాణ దినములను నక్షత్ర భుక్తిగడియలతో గుణించి నక్షత్రాద్యంత ఘడియలతో భాగించిన లబ్ధము గతదినము. దశాప్రమాణ దినములలో గతదినములను తీసివేయగా మిగిలినది వర్షప్రవేశకాలము. మొదలు ప్రథమ దశాశేషదినములగును తర్వాత క్రమముగా ౮ దశలు వ్రాసి అనంతరము ప్రథమదశయందలి గతదినములను వ్రాయవలయును. ఇట్లు సంవత్సరమునకు తొమ్మిది గ్రహదశలు పూర్తియగును. ఈవర్షదశాఫలములు వర్షలగ్నకుండలిలోని గ్రహబలాబలముల ననుసరించి చూడదగినవి.

## మౌఢ్యమందు జేయదగని కార్యములు

గురు శుక్రులలో నెవరయినను అస్తంగతుఁ డగుచుండఁగా బావి, కొలను, చెరువు త్రవ్వుట, యాగము, గమనము, క్షురకర్మ, దేవతాప్రతిష్ఠ, వివాహోపనయనములు, విద్యారంభము, నూతనగృహారంభము, కర్ణవేధ, మహా దానములు, వనములు స్థాపించుట, పుణ్యతీర్థములు సేవించుట, నూతన మంత్రానుష్ఠాన పట్టాభిషేకములు మొదలయిన సమస్త శుభకర్మములు వర్జింపవలయును. అశుభకర్మలుగాక, తక్కిన వివాహాది శుభకార్యములు క్షయమాసాధిక మాసములయందు చేయఁగూడదు

## మౌఢ్యమందు జేయదగిన కార్యములు

అశ్లేషా మూలాది గండనక్షత్రముల శాంతులకును, రోగసంబంధమైన జపహోమాది శాంతులకున్ను గ్రహశాంతికిని, అభిషేకము, సమస్తవ్రతములు, ఉత్పాతదోషములు మొదలగువాని శాంతులకును గురు శుక్రమౌఢ్య దోషములులేవు.

## కర్తరిలో జేయదగని కార్యములు

కర్తరియందు చెట్లు నఱకుట, నారతీయుట, కృష్యారంభముచేయుట, విత్తనముచేయుట, భూమిని త్రవ్వుట, క్రొత్తగ్రామమును కట్టుట, గృహమును కట్టుట, క్షౌరము చేసికొనుట, తోటలువేయుట, చెరువులు బావులు త్రవ్వుట, క్రొత్తబండి నెక్కుట ఇట్టికార్యములు చేయఁగూడదు.

## కర్తరిలో జేయదగిన కార్యములు

" మౌంజీబంధే వివాహే చ ప్రవేశే యజ్ఞకర్మణి । ధరణీ కృత్తికా చైవ న దోషో మంటపాదిషు "

తా॥ కర్తరియందు ఉపనయనము, వివాహము, ప్రవేశము, యజ్ఞము, మంటపాదులు గట్టుట ఇట్టికార్యములు చేయవచ్చును.

## బాలారిష్టదోషములు

జననకాల లగ్నమునకు చంద్రుడు ౮ టను, కుజుడు ౭ టను, రాహువు ౯ టను, శని ౧ టను, గురుండు ౩ టను, సూర్యుఁడు ౫ టను, శుక్రుడు ౬ టను, బుధుడు ౪ టను, కేతువు ౨ టను, ఉన్నపక్షమున బాలారిష్ట దోషములు సంభవించును. శిశువు జన్మించిన లగ్నమునకు ౧-౫-౬-౭-౮-౧౨ రాసులయందు పాపగ్రహము గూడియుండినను లేక పాపగ్రహములచే జూడబడినను, మరియు క్షీణచంద్రుడు ౧౨-వ రాశియందుండగా ౧-౮-వ రాసులయందు పాప గ్రహములుండినను బాలారిష్టదోషములు సంభవించును.

## బాలారిష్ట దోషభంగములు

శిశు జన్మలగ్నమునకు పై రాసులందు ఆయా గ్రహములుండినను, ఆయా రాసులను బలమగు శుభగ్రహములు చూచినను, కేంద్రములందు ఒక శుభ గ్రహముండినను దోషములేదు.

## * మరణవిషయమై దుష్ట నక్షత్రములు

మృగశిర - చిత్త - ౨ నెలలు, కృత్తిక - పునర్వసు - ఉత్తర - విశాఖ - ఉత్తరాషాఢా నక్షత్రములకు - ౩ నెలలు, రోహిణి - మఘ నక్షత్రములకు - ౫ నెలలు, ధనిష్ఠ - శతభిషక్ - పూర్వాభాద్రా - ఉత్తరాభాద్రా - రేవతీ నక్షత్రములకు - ౬ నెలలు. పై నక్షత్రములయందు మరణము సంభవించిన యెడల, ఆ యా నక్షత్రమున కేర్పడిన నెలలకాలము ఇంటిని విడువవలెను. శాంతిచేసి ఇంటిలో తిరిగి చేరవలెను.

* కొందరిమతమున, తల్లిదండ్రుల మరణము, పై నక్షత్రాదులలో గలిగిన, ఇల్లు విడువ బనిలేదు. ఇది దేశాచారము ననుసరించినది.

## రజస్స్వలా విషయమై దుష్టతిథివారనక్షత్రములు

ఉభయపక్షంబులందును ౧—౪—౬—౮—౧౨—౧౪—౩౦ యీ తిథులును శని మంగళవారంబులును భరణి, కృత్తిక, ఆర్ద్రి, పునర్వసు, ఆశ్లేష, మఘ, పుబ్బ, జ్యేష్ఠ, పూర్వాషాఢా, పూర్వాభాద్రా, ఈ నక్షత్రములును కూడనివి. కృత్తికయందు రజస్స్వలయయిన ౪ మాసంబులును, మఘ, ఆర్ద్రి-౬ మాసంబులును-జ్యేష్ఠా-పునర్వసు-ఆశ్లేష-పుబ్బ పూర్వాషాఢా-పూర్వాభాద్రలు- ౧ సంవత్సరమున్ను-భరణి- ౮ మాసంబులును కూడనివి. ఇందులకు ఆ యా నక్షత్రములకు శాంతి చేసి భర్తృవీక్షణము చేయుట గర్భాధానంబు చేసుకొనుట శాస్త్రసమ్మతము.

## నూతన క్షేత్రమునందు కృష్యారంభమునకు ఉక్తకాలము.

శ్లో॥ మైత్రార్క త్రయరోహిణీ వసుమఘా దస్రోత్తరాంత్యాసురే-
షార్వ్యార్కజ్ఞకవేర్దినేషు శుభదో మధ్యస్తు చాంద్రే దినే।
త్యక్త్వా రిక్తదినాని దగ్ధదివసాన్దర్శావమా వైధృతి-
వ్యాఘాతవ్యతిపాతవిష్టిదివసాః శేషాః కృషౌ శోభనాః॥ (జ్యోతిషఫలాభిదర్శిని)

తా॥ అనూరాధ, హస్త, చిత్త, స్వాతి, రోహిణి, ధనిష్ఠ, మఘ, అశ్విని, ఉత్తరఫల్గుని, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, రేవతి, మూల ఈ నక్షత్రములును, భాను, భౌమ, బుధ, శుక్రవారములును, నూతనభూమి దున్నుటకారంభించుటచేత, శుభము గలుగుననియును, సోమవారము మధ్యమమనియును, రిక్తతిథులును, దగ్ధతిథులును, పాడ్యమియును, అమావాస్యయును, అవమయును, వైధృతి, వ్యాఘాత, వ్యతీపాతయోగములును, భద్రవాకరణమును, అనువానిని విడిచిపెట్టి, మిగిలినదినములయందు కృషినిచేయుటకు నూతనముగా ప్రవేశించుటచేత శుభములు గలుగును.

## చెరుకు, అరటిచెట్లు, మామిడిచెట్లు మొదలగునవి వేయుటకు ముహూర్తములు

శ్లో॥ రేవత్యుత్తర రోహిణీ గురుకరాదిత్యేషు నక్తంచరే
వాయౌ వారుణ వాజినోశ్చ శశిజేంద్వార్యేషు వారేషు చేత్।
వృక్షస్థాపనబీజవాపనహలప్రారంభకార్యే శుభం
కన్యాకర్కియుగోక్షమీనమకరే సంపూర్ణ ధాత్రీఫలమ్॥

తా॥ రేవతి, ఉత్తర, రోహిణి, పుష్యమి, హస్త, పునర్వసు, మూల, స్వాతి, శతభిషక్, అశ్విని, ఈ పది నక్షత్రములును, గురు, బుధ, సోమవారములును, కన్యా, కర్కాట, మిథున, వృషభ, మీన, మకరరాసులును, అన్ని విత్తనములు నాటుటకు, కృషికర్మనారంభించుటకు, విత్తనములు చల్లుటకును, ప్రశస్తములయినవి. పై చెప్పబడిన కార్యములను ముహూర్తములు చూచి ప్రారంభించిన, సంపూర్ణముగా నకలసస్యములు ఫలించును.

## ఉల్లితోట వేయుటకు ఉక్తకాలము

శ్లో॥ రేవత్యశ్వినిమైత్రవాయువరుణాదిత్యేంద్రవిష్ణ్విజ్యమూ-
లార్కార్ద్రేందుషు భానుసోమగురువారేష్వేవ వృద్ధిప్రదమ్ ।
పూర్ణాయాం మృగమీనకర్కటధనుఃకుంభేషు చారోదయే
స్థాప్యం గృంజనముక్తమాహురితి వాసిష్ఠాత్రిగార్గ్యాదయః ॥

తా॥ రేవతి, అశ్విని, అనూరాధ, స్వాతి, శతభిషం, పునర్వసు పుష్యమి, ఉత్తర, హస్త, జ్యేష్ఠ, శ్రవణము, మూల, మృగశిషః, ఈ పదమూడు నక్షత్రములును, ఆది, గురు, సోమవారములును, పంచమీ, దశమీ, పూర్ణిమా తిథులును, మకర, మీన, వృశ్చిక, ధనుః, కుంభములు ఈ లగ్నములున్ను ఉల్లివిత్తనములు పాతిపెట్టుటకు మేలని వసిష్ఠాది మహామునులు చెప్పిరని తాత్పర్యము.

## ఏరువాకకు ఉక్తకాలము

శ్లో॥ పూర్వారేందుమఘాదితీ విధిహయశ్రీశత్రయత్ర్యుత్తర-
త్ర్యాదాంత్యసమీరమిత్రగురుషు క్ష్మాజార్యతీక్ష్ణత్విషామ్
వారే స్యాద్ధలకర్మ గోంత్యయుగకన్యాచాపకీటే శుభం
తౌళీనక్రఘటాజకర్కిహరిషు ప్రాణఘ్నసస్యక్షయౌ ॥
చోరత్రాసపశుఘ్నదాహభుజగత్రాసా భవేయుః క్రమాత్ ॥

తా॥ విశాఖ, హస్త, మృగశిర, మఖ, పునర్వసు, రోహిణి, అశ్విని, శ్రవణం, ధనిష్ఠ, శతభిషం, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, మూల, రేవతి, స్వాతి, అనూరాధ, పుష్యమి, ౧౮ నక్షత్రములయందును, కుజ, గురు, భానువారములయందును, వృషభము, మీనము, మిథునము, కన్య, ధనుస్సు, వృశ్చికము ఈ లగ్నములయందును కృషికర్మనారంభించుటచేత నానావిధములయిన శుభఫలములు గలుగును. తులాలగ్నమునందు కృషికర్మ నారంభించిన ప్రాణహాని గలుగును. మకరమున నారంభించిన సస్యనాశనమును - కుంభమునం దయ్యేనేని చోరభయమును, మేష మునందారంభించిన పశుహానియు, కర్కాటకమునందారంభించినయెడల పశువులకు హానియు సింహమందారంభించిన యెడల సర్పములవలన మనుష్యులకు భయమును గలుగునని తాత్పర్యము.

## శెనగవిత్తులు చల్లుటకును, విత్తనములు కట్టకట్టుటకును ఉక్తకాలము

శ్లో॥ మూలాత్ర్యుత్తర వైష్ణవేంద్వదితివస్వంత్యాజ మైత్రానిలే-
ష్వేవం కర్కిధనుర్ఘట స్థిరగృహేష్వాహుశ్చ వారే శుభే ।
బీజావాపనమన్వహం చణక గోధూమాఢకానాం శుభం
మూలాత్ర్యుత్తర మైత్ర పూర్వమఘ విష్ణ్వంత్యేజ్యభే బంధనమ్ ॥

తా॥ మూల, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, శ్రవణము, మృగశిర, పునర్వసు, ధనిష్ఠ, రేవతి, రోహిణి, అనూరాధ, స్వాతి, ఈ ౧౨ నక్షత్రములయందును కర్కాటము, ధనుస్సు, తుల, వృషభము, సింహము, వృశ్చికము, కుంభము ఈలగ్నములయందును, బుధ, గురు, శుక్ర వారములయందును శెనగ, గోధుమ కందులు ఈ విత్తనములు చేలయందు చల్లుటచేత అధికముగా ఫలించునని యెరుంగవలయును. మరియు మూల, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, అనూరాధ, విశాఖ, మఖ, శ్రవణము, రేవతి, పుష్యమీ – ఈ పది నక్షత్రములయందు నానాజాతి విత్తనములను మూటలు కట్టిపెట్టుటచే నానావిధములగు శుభములు గలుగునని తాత్పర్యము.

## వధూవరుల పొంతనములు

| నామాద్యక్షరములు | నక్షత్రం | పాదము | రాసులు | రాశ్యధిపతులు | ౧ గణము | ౨ జంతువులు | ౩ నాడి | ౪ రజ్జు |
|---|---|---|---|---|---|---|---|---|
| చూ చే చో ల | అశ్వని | ౪ | మేషం | కుజ | దేవ | గుఱ్ఱం | ఆది | పాద |
| లీ లూ లే లో | భరణి | ౪ | మేషం | కుజ | మను | ఏనుగ | మధ్య | కటి |
| అ ఈ ఉ ఏ | కృత్తిక | ౧_౩ | మే_వృష | కు_శు | రాక్ష | మేక | అంత్య | ఉదర |
| ఓ వా వీ వో | రోహిణి | ౪ | వృషభం | శుక్ర | మను | పాము | అంత్య | కంఠ |
| వే వో కా కి | మృగ | ౨_౨ | వృష_మిథు | శు_బు | దేవ | పాము | మధ్య | శిరస్సు |
| కూ ఘ ఙ ఛ | ఆర్ద్ర | ౪ | మిథునం | బుధ | మను | కుక్క | ఆది | కంఠ |
| కే కో హా హీ | పునర్వ | ౩_౧ | మిథు_కట | బు_చం | దేవ | పిల్లి | ఆది | ఉదర |
| హూ హే హో డా | పుష్య | ౪ | కటకం | చంద్ర | దేవ | మేక | మధ్య | కటి |
| డీ డూ డే డో | ఆశ్లే | ౪ | కటకం | చంద్ర | రాక్ష | పిల్లి | అంత్య | పాద |
| మా మీ మూ మే | మఖ | ౪ | సింహం | రవి | రాక్ష | ఎలుక | అంత్య | పాద |
| మో టా టీ టూ | పుబ్బ | ౪ | సింహం | రవి | మను | ఎలుక | మధ్య | కటి |
| టే టో పా పీ | ఉత్తర | ౧_౩ | సింహ_కన్య | రవి_బు | మను | గోవు | ఆది | ఉదర |
| పూ ష ణ ఠ | హస్త | ౪ | కన్య | బుధ | దేవ | ఎనుము | ఆది | కంఠ |
| పే పో రా రి | చిత్త | ౨_౨ | కన్య_తుల | బు_శు | రాక్ష | పులి | మధ్య | శిరస్సు |
| రూ రే రో త | స్వాతి | ౪ | తుల | శుక్ర | దేవ | దున్న | అంత్య | కంఠ |
| తీ తూ తే తో | విశాఖ | ౩_౧ | తుల_వృశ్చి | శు_కు | రాక్ష | పులి | అంత్య | ఉదర |
| నా నీ నూ నే | అనూ | ౪ | వృశ్చికం | కుజ | దేవ | జింక | మధ్య | కటి |
| నో యా యీ యూ | జ్యేష్ఠ | ౪ | వృశ్చికం | కుజ | రాక్ష | జింక | ఆది | పాద |
| యే యో బా బీ | మూల | ౪ | ధనుస్సు | గురు | రాక్ష | కుక్క | ఆది | పాద |
| బూ ధా భా ఢా | పూ_షా | ౪ | ధనుస్సు | గురు | మను | కోతి | మధ్య | కటి |
| బే బో జా జీ | ఉ_షా | ౧_౩ | ధను_మక | గు_శని | మను | ముంగిస | అంత్య | ఉదర |
| జూ జే జో ఖా | అభి | | మకరం | శని | ౦ | ముంగిస | ౦ | ౦ |
| ఖీ ఖూ ఖే ఖో | శ్రవణ | ౪ | మకరం | శని | దేవ | కోతి | అంత్య | కంఠ |
| గా గీ గూ గే | ధనిష్ఠ | ౨_౨ | మకర_కుంభ | శని_శని | రాక్ష | సింహం | మధ్య | శిరస్సు |
| గో సా సీ సూ | శతభిష | ౪ | కుంభం | శని | రాక్ష | గుఱ్ఱం | ఆది | కంఠ |
| సే సో దా దీ | పూ.భా | ౩_౧ | కుంభ_మీనం | శ_గురు | మను | సింహం | ఆది | ఉదర |
| దు ఖ్య ఝా థా | ఉ.భా | ౪ | మీనం | గురు | మను | గోవు | మధ్య | కటి |
| దే దో చా చీ | రేవతి | ౪ | మీనం | గురు | దేవ | ఏనుగు | అంత్య | పాద |

కృష్ణ—మృగ ౩ హృష్ణ—స్వాతి ౧ శ్రీధరః—చిత్త ౪ క్షేత్రపాల—హస్త ౨ జ్ఞాన—ఆర్ద్ర ౩
భీమ—మూల ౩ భైరవ—పూ-షా ౩ బ్రహ్మ—చిత్త ౩-౪ పా, ప్రభాకర—చిత్త ౩-౪ పా,
ప్రహ్లాద—చిత్త ౩-౪ పా, ప్రాణ—ఉత్తర ౩ ద్రోణ—స్వాతి ౧ ద్రౌపది—స్వాతి ౩ (నామ నక్షత్రములు.)

కృత్తిక, ఉత్తర, ఉత్తరాషాఢ. సూర్యదశ ౬ సం॥ పుష్యమి, అనూరాధ ఉత్తరాభాద్ర శనిదశ ౧౯ సం॥
రోహిణి, హస్త, శ్రవణం. చంద్రదశ ౧౦ సం॥ ఆశ్లేష, జ్యేష్ఠ, రేవతి బుధదశ ౧౭ సం॥
మృగశిర, చిత్త, ధనిష్ఠ కుజదశ ౭ సం॥ అశ్వని, మఘ, మూల కేతుదశ ౭ సం॥
ఆర్ద్ర, స్వాతి, శతభిషం రాహుదశ ౧౮ సం॥ భరణి, పూర్వఫల్గుని, పూర్వాషాఢ శుక్రదశ ౨౦ సం॥
పునర్వసు, విశాఖ, పూర్వాభాద్ర గురుదశ ౧౬ సం॥ మొత్తం ౧౨౦ సం॥

## దశవిధ పొంతనము

**నాడిపొంతనము॥** చతుష్పాద నక్షత్రములయందుబుట్టిన స్త్రీపురుషులకు అశ్వని మొదలు మూడు వేళ్లయందును త్రిపాన్నక్షత్రములయందు బుట్టిన స్త్రీపురుషులకు కృత్తిక మొదలు నాలుగు వ్రేళ్లయందును ద్విపాన్నక్షత్రములయందు బుట్టిన స్త్రీ పురుషులకు మృగశిర మొదలు ఐదు వ్రేళ్లయందును లెక్కించగా స్త్రీ పురుష నక్షత్రములు ఒక వ్రేలియందు నశుభమనియు భేదంబుగా నున్నయెడల శుభకరంబనియు తెలియవలయును.

**రాశివర్గ॥** స్త్రీ పురుష రాసు లొకటియైనను, స్త్రీరాశికి, పురుషరాశి ౬కి పైబడినను ఉత్తమము స్త్రీరాశికి, పురుషరాశి ౩-౪ అయితే మధ్యమము. ౨-౫-౬ రాసులైతే అధమము ౮-వ రాశులైతే పనికిరాదు: దీని ఫలం వంశవృద్ధి

**రజ్జువర్గః॥** మృ చిత్ర ధని రో హస్త శ్ర ఆ స్వా శత ౧ కృత్తి ఉత్త ఉషా పున విశా పూభా ౧ భర పుబ్బ పూషా పుష్య అనూ ఉభా ౧ అశ్వి మఖ మూ ఆశ్లే జ్యే రేవ ౧

శ్లో॥ ఏకరజ్జుర్మృత్యుకరీ భిన్నరజ్జుశ్శుభావహా॥

**వశ్యవర్గః॥**

| | | | |
|---|---|---|---|
| మేషస్య సింహా వృశ్చిక రాశీ | వశ్యౌ। | తులాయాః మకర రాశిః | వశ్యో |
| వృషభస్య కటక తులారాశీ | ,, | వృశ్చికస్య కటక కన్యారాశీ | ,, |
| మిథునస్య కన్యారాశిః | ,, | ధనుషః మీనరాశిః | ,, |
| కటకస్య వృశ్చిక ధనూరాశీ | ,, | మకరస్య కుంభరాశిః | ,, |
| సింహస్య మకరరాశిః | ,, | కుంభస్య మీనరాశిః | ,, |
| కన్యాయాః వృషభ మీనరాశీ | ,, | మీనస్య మకరరాశిః | ,, |

శ్లో॥ స్త్రీ రాశుసగణాజ్జాతా హంతి మర్త్యగణం వరమ్।

**దినవర్గః॥** శ్లో॥ కన్యాదినవశాద్గాంగంక యేన్నవభాజితమ్। శిష్టం సమం సుదిశుభం విషమం చేదరిష్టదమ్॥

తా॥ కన్యాజన్మ, నామ నక్షత్రము మొదలు వరజన్మ నామ నక్షత్రమువరకు యెంచి తొమ్మిదిచే భాగించగా పరిసంఖ్య శుభమున్ను విషమసంఖ్య అరిష్టమున్ను జేయు॥

**మాహేంద్రవర్గః॥** వధూనక్షత్రము మొదలు వరనక్షత్రమువరకు లెక్కించగా ౧-౪-౭-౧౦-౧౩-౧౬-౧౯ ౨౨-౨౫ ఐతే మేలుకలదు.

**యోనివర్గః॥** అశ్వి-శత గుఱ్ఱములు, భరణి-రేవతి యేనుగ, పుష్య-కృత్తిక మేక, రోహి-మృగ సర్పములు, ఆ-మూ కుక్క, పున-ఆశ్లే పిల్లి, మఖ-పుబ్బ ఎలుక, హస్త-స్వాతి ఎనుము, చిత్త-విశా పులి, అనూ-జ్యే జింక, ఉ-ఉ ఉ-భా ఆవు, అభి ఉ-షా ముంగిస, పూ-భా ధని సింహము. పూ-షా శ్రవ కోతి.

**వర్ణవర్గః॥** కర్కిా వృశ్చిక మీనములు బ్రాహ్మణులు, మేషసింహ ధనుస్సులు క్షత్రియులు. మిథునతులా కుంభములు వైశ్యులు. వృషభకన్యా మకరములు శూద్రులు.

శ్లో॥ న దద్యాద్వర్ణహీనస్య వర్ణశ్రేష్ఠాం తు కన్యకామ్॥

**స్త్రీ దీర్ఘవర్గః॥** వధూనక్షత్రమారభ్య నవభాదూర్ధ్వసంస్థితమ్। వరభం శుభదం ప్రోక్తమితి దైవవిదాం వరైః॥

గ్రహమైత్రి పట్టిక

| గ్రహములు | రవికి | చంద్రునికి | కుజునికి | బుధునికి | గురునకు | శుక్రునికి | శనికి |
|---|---|---|---|---|---|---|---|
| మిత్రులు | చం_కు_గు | ర_బు | ర_చం_గు | ర_శు | ర_చం_కు | బు_శ | బు_శు |
| సములు | బు | కు_గు_శు_శ | శు_శ | కు_గు_శ | శ | కు_గు | గు |
| శత్రులు | శు_శ | ౦ | బు | చం | బు_శు | ర_చం | ర_చం_కు |

౧. పంచకము ॥ ప్రతిపదాది తిథులు, భానువారాది వారములు, అశ్విన్యాది నక్షత్రములు, మేషాది లగ్నములు జేర్చి ఆ సంఖ్యను తొమ్మిదితో భాగించగా మిగిలిన సంఖ్య ౧ మృత్యువు, ౨ అగ్ని, ౪ రాజ, ౬ చోర, ౮ రోగపంచకములు. ఇవి అశుభములు. చోర రోగములు రాత్రియందును, రాజాగ్నులు పగటియందును, మృత్యువు దివారాత్రులయందును ముఖ్యముగా పనికిరానివి.

పంచకరహితములో కొన్ని సూచనలు

ముహూర్తనిర్ణయమందు చూచెడి పంచకమున తిథివార నక్షత్రలగ్నములు నాల్గింటిని మాత్రము తరుచుగా చూచుట ఆచారమైయున్నది. ఆ గణనములో లగ్నధ్రువకము ఐదవదని పెద్దలందురు. అనగా మేషమునకు—౫, వృషభమునకు—౭, మకరమునకు—౨, కుంభమునకు—౪, మీనమునకు—౬ సంఖ్యలు ధ్రువకమనబడును. తక్కిన రాసులకు ధ్రువకములేదు. అవసరమైతే వీనినికూడ చేర్చుట ఉచితమే.

పంచకదానములు :— అవసరమై ఆచరింపవలసివచ్చినప్పుడు 1, 2, 5, 6, 8 పంచకములకు క్రమముగా, రత్నములు, చందనము, నిమ్మపండ్లు, దీపము, ధాన్యము వీనిని దానముచేసి పరిహారముచేసుకొనవలెనని యొకమతము. మరియు మధ్యాహ్నమందు రాజ అగ్నిపంచకములు, రాత్రిలో రోగ చోర పంచకములు, సర్వత్ర మృత్యుపంచకము విడువదగినది. అట్లే ఉపనయనమందు రోగపంచకము, వివాహమందు రాజపంచకము, గృహకర్మలందు అగ్నిచోరపంచకములు, సకలకర్మలందు మృత్యుపంచకమును త్యజింపదగినదనియు చెప్పుదురు.

౨. తారాబలము

జన్మభం దేహనాశాయ సంపత్సంపద ఏవ చ। విపచ్చ కార్యనాశాయ క్షేమం క్షేమకృతే భవేత్ ॥
ప్రత్యక్చ కార్యనాశాయ సాధనం కార్యసాధనే। నైధనం నిధనేఽపి స్యాన్మిత్రం చ సుఖసంపది।
పరమమైత్రం సుఖే విద్యాత్తారాబలమితి క్రమాత్ ॥

తారాబలము ॥ జన్మనక్షత్రము [లేక నామనక్షత్రము] మొదలు దిననక్షత్రము వరకు లెక్కించి ఆసంఖ్యను తొమ్మిదితో భాగించగా మిగిలిన సంఖ్య ౧ జన్మతార, ౨ సంపత్తార, ౩ విపత్తార, ౪ క్షేమతార, ౫ ప్రత్యక్తార, ౬ సాధనతార, ౭ నైధనతార, ౮ మిత్రతార, ౯ పరమ మైత్రతార ॥

పై చెప్పబడిన తొమ్మిది తారలలో జన్మతారవలన దేహనాశనమును, సంపత్తారవలన సంపదయును, విపత్తారవలన కార్యనాశమును, క్షేమతారవలన క్షేమమును, ప్రత్యక్తారవలన కార్యహానియు, సాధనతారవలన కార్యసాధనమును, నైధనతారవలన మరణమును, మిత్రతారవలన సుఖమైత్రవృద్ధియు, పరమమైత్రతారవలన దేహసౌఖ్యమును కలుగును

శుభతారలు : సంపత్ - క్షేమ - సాధన - మిత్ర - పరమమైత్రములు ॥ అశుభతారలకు దానములు॥ జన్మతారకు శాకము - విపత్తుకు గుడము - ప్రత్యక్తారకు లవణము - నైధనతారకు తిలసహితకాంచనము ॥ ఈ అశుభ తారలయందు మిక్కిలి క్రూరకాలము—జన్మతారయందు ౩ పాదము - విపత్తారయందు ౧ పాదము - ప్రత్యక్తారయందు ౪ పాదము నైధనతారయందు ౨ పాదము

తారాబలమునందు, మొదటి పర్యాయమునందు విపత్తు, ప్రత్యక్తారము, నైధనము విడువదగినవి రెండవపర్యాయమందు దోషాంశ మును త్రోసివేయు, మూడవ పర్యాయమునందు సర్వమును గ్రహించదగును.

౩. చంద్రబలము॥ జన్మరాశి (లేక నామరాశి) మొదలు ౧-౩-౬-౭-౧౦-౧౧ రాసులయందు చంద్రుడు శుభుడు. ౨-౪-౫-౮-౯-౧౨ రాసులయందు అశుభుడు. శుక్లపక్షమున ౨-౫-౯ కృష్ణ పక్షమున ౪-౮-౧౨ రాసులయందు శుభుడు.

౪. నిషేకమునకు॥ శుభనక్షత్రములు—శ్ర-రో-హ-అనూ-స్వా-రే-మూ-ఉఫ-ఉషా-ఉభా-శత ఇవి ఉత్తమనక్షత్రములు॥ పుష్య-ధని-మృ-అశ్వి-చిత్త - పున ఇవి మధ్యమనక్షత్రములు ॥ లగ్నశుద్ధి ఉండవలయును. అష్టమము పాపగ్రహవర్జితమైయుండవలెను.

౫. సీమంతమునకు॥ శుభమాసములు॥ ౪-౬-౮॥ శుభనక్షత్రములు॥ అశ్వి-రో-మృ-పున-పుష్య-ఉఫ-హ-చి-స్వాతి-అనూ-మూ-ఉషా-శ్రవ-ధని-శత-ఉభా-రే అష్టమశుద్ధియును, లగ్న పంచమాష్టమ ద్వాదశములు పాపగ్రహవర్జితములుగా నుండవలయును.

౬. అన్నప్రాశనమునకు॥ శుభమాసములు, మగశిశువులకు ౬-౮-౧౦ ఆడశిశువులకు ౫-౭-౯. శుభనక్షత్రములు. అశ్వి-రో-మృ-పున-పుష్య-ఉఫ-హ-చి స్వా-అనూ-ఉషా-శ్ర-ధ-శ-ఉభా - రే. దశమశుద్ధి ఉండవలయును.

౭. అక్షరాభ్యాసమునకు॥ ౫వ సంవత్సరము । సూర్యుడు చరస్థిరరాసులయందుండగా, అశ్వి-పున-పుష్య-హ-చి-స్వా-అనూ-శ్ర-రే యీ ౯ నక్షత్రములు, మేష-కటక-తులా-మీన-లగ్నములు-అష్టమశుద్ధి శుభము. చతుర్థశుద్ధి ఉండవలెను, కేంద్రమందు శుభులుండిన విశేషము.

౮. ఉపనయనమునకు॥ ఉత్తరాయణము శుక్లపక్షము-అశ్వి-రో-మృ-పున-పుష్య-ఉఫ-హ-చి-స్వా-అనూ-ఉషా-శ్ర-ధ-శ-ఉభా-రే యీ నక్షత్రములు, అష్టమశుద్ధియు ఉత్తమంబులు. లగ్నము పాపగ్రహవర్జితముగానుండవలెను.

౯. వివాహమునకు శుభనక్షత్రములు॥ రో-మృ-మఖ-ఉఫ-హస్త-స్వా-అనూ-మూ-ఉషా-ఉభా-రేవ. సప్తమశుద్ధి కలిగియుండవలయును.

౧౦. గృహారంభమునకు॥ శుభమాసములు, వైశాఖ, శ్రావణ, మార్గశిర, పుష్య, ఫాల్గుణములు ఉత్తమంబులు । చైత్ర, కార్తిక, మాఘమాసములు మధ్యమంబులు ॥ శుభనక్షత్రములు. అశ్విని-రోహిణి-మృగ-పున-పుష్య-ఉఫ-హస్త-చిత్త-స్వా-అనూ-ఉషా-శ్ర-ధ-శత-ఉభా-రే. మధ్యాహ్నత్పూర్వము. చతుర్థము ద్వాదశము శుద్ధి కలిగియుండవలయును.

౧౧. గృహప్రవేశమునకు॥ శుభనక్షత్రములు, రోహి-మృ-చిత్త-అనూ-ధ-శత-రే-ఉఫ-ఉషా-ఉభా. ద్వాదశశుద్ధియు. అష్టమము పాపగ్రహవర్జితముగానుండవలయును.

ఈ చెప్పిన నిషేకాది ముహూర్తములకు ద్వితీయా-తృతీయా-పంచమి-సప్తమి-దశమి శుక్లత్రయోదశీ యు. గ్రహారంభమునకు పూర్ణిమయును. శుభతిథులు, శుభవారములు సోమ-బుధ-గురు-శుక్రవారములు. శుభ లగ్నములు వృష-మిథున-కటక-కన్యా-తుల-ధనుః-మీనలగ్నములు. చతుర్థ-సప్తమ-దశమ-పంచమ నవముల యందు పూర్ణచంద్ర-బుధ గురు శుక్రులు ; ౩-౬-౧౧ స్థానములయందు రవి-కుజ-శని-రాహు-కేతువులు, లగ్నమునకు పాపగ్రహ దృష్టిలేక శుభదృష్టి కలిగియుండవలయును.

౧౨, కూపారంభము॥ శుభతిథులు ద్వితీ-తృతీ-పంచ-దశ-ద్వాద-త్రయో-పూర్ణి. శుభవారములు సోమ-బుధ-గురు-శుక్ర. శుభనక్షత్రములు. రో-పుష్య-మఖ-ఉఫ-హ-అనూ-ధని-శత-ఉభా. శుభలగ్నములు వృషభ-కర్కాట-మకర-కుంభ-మీనములు. అష్టమశుద్ధియు, కేంద్రములయందు చంద్ర శుక్రులు ఉండవలయును.

## లగ్నత్యాజ్యాది విషయము

మేష వృషభ ధనుః కన్యాలగ్నముల ఆదియందు భుజంగమను పేరునను, మీన మకర కర్కాట వృశ్చికముల కడపట రాహువను పేరునను, మిథున కుంభ తులా సింహముల మధ్యభాగమందు గృధ్రమను పేరునను లగ్నత్యాజ్యము కలదు. కనుక త్యాజ్యకాలము అరగడియను విడమనది

మరియు కాలవిధానమందు లగ్నస్యాదౌ విషం త్యక్త్వా పశ్చాత్కర్మాణి కారయేత్ ।
తల్లగ్నం వర్జయేద్ధీమాన్ లగ్నస్యాన్తే విషం యది ॥

లగ్నమునకు ఆదియందు విషఘడియలు వచ్చినచో ఆ ఘడియలను మాత్రము త్రోసి శుభ కర్మలుచేయవచ్చును. కడపట విషఘడియలు తగిలిన లగ్నమునే విడువవలెను.

### ౧ అంగస్ఫురణము

శిరసి-భూలాభః. లలాటే-స్థానవృద్ధిః. భ్రూమధ్యే-ప్రియజనసమాగమః. నాసామధ్యే-సహాయలాభః. నేత్రాగ్రే-ఇష్టవస్తుప్రాప్తిః కాలవిళంబః. నేత్రాంతే-ధనలాభః. నేత్రాధోభాగే-యుద్ధజయః. నాసికాయాం-ప్రీతిస్సుఖం చ. గండస్థలే-స్త్రీలాభః. కర్ణే-ప్రియవార్తాశ్రవణం. ఓష్ఠయోః-ఇష్టవస్తుభోజనప్రాప్తిః. కంఠే-భోగః. అంసే-భోగవృద్ధిః. భుజయోః-మిత్రలాభః. హస్తయోః-ధనలాభః వక్షసి-విజయః. స్తనయోః-ప్రియవస్తులాభః. హృదయే-దుఃఖం. ఆంత్రే-ధనప్రాప్తిః. నాభ్యాం-స్థానభ్రంశః. నాభేరధఃప్రదేశే-స్త్రీలాభః. పార్శ్వయోః-ఆనందః. పృష్ఠే-పరాజయః. కట్యాం-సంతోషః బలంచ. కట్యధోభాగే-వాహనప్రాప్తిః-శిశ్నే, యోనౌ-సంతానప్రాప్తిః. ఊర్వోః పృష్ఠభాగే-దోషః. ఊర్వోః పురోభాగే-సహాయలాభః. జాన్వోః-శత్రుసంధిః. జంఘయోః-నష్టం. పాదయోః-స్థానలాభః. పాదాగ్రయోః-లాభసహిత ప్రయాణం॥

•. ఈ అంగస్ఫురణము పురుషులకు కుడిపార్శ్వమున, స్త్రీలకు యెడమపార్శ్వమున శుభఫలమైతే మిక్కిలి శుభము. పురుషులకు యెడమపార్శ్వమున, స్త్రీలకు కుడిపార్శ్వమున అశుభఫలమైతే మిక్కిలి అశుభము కలుగును. అశుభఫలములకు సువర్ణదానము చేయతగినది.

### ౨ శుభశకునములు

ముత్తైదువ, కన్య, వేశ్య, ఇద్దరు బ్రాహ్మణులు, మంగళవాద్యము, ఫలము, పుష్పములు, గొడుగు, చెఱకు, అన్నము, పాలు, పెరుగు, మాంసము, పొగలేని అగ్ని, తేనె, ఏనుగు, యెద్దులు, మద్యము గుఱ్ఱము, చలువవస్త్రములు, అక్షతలు మొదలైన మంగళవస్తువులు యెదురుగా వచ్చినంతట శుభము కలుగును.

## మాసత్యాజ్యములు

చిత్రి ౮-౧౫ వైయ్యాశి ౭-౧౮-౧౭ ఆసి ౧-౮ అది ౨-౧౦-౨౦ ఆవణి ౨-౯-౨౪ పెరటాశి ౧౮-౨౯ అల్పిశి ౮-౨౦ కార్తికి ౧-౧౦-౧౭ మార్గళి ౮-౯-౧౧ తై ౧-౨-౩-౧౧-౧౭ మాశి ౧౫-౧౮-౧౭ పంగుని ౮-౧౫-౧౭ ఇందులో కనిన తేదులలో పగలు శుభకార్యములు వర్జింపతగినవి. ఇది ద్రావిడాచారము.

## జన్మనక్షత్రమందు చేయదగిన కార్యములు

నిషేకము, యాగము, చౌలము, అన్నప్రాశనము, వ్యవసాయము, ఉపనయనము, పట్టాభిషేకము, భూసంపాదనము అక్షరాభ్యాసము ఇట్టి కార్యములు చేయవచ్చును.

## జన్మనక్షత్రమందు చేయదగని కార్యములు

పుంసవనము, యుద్ధము, సీమంతము, గర్భాధానము, శ్రాద్ధము, క్షౌరము, ఔషధసేవ, ప్రయాణము, వివాహము ఇవి చేయగూడదు. మఱియును, స్త్రీలకు వివాహవిషయమందు జన్మనక్షత్రము శ్రేష్ఠమని గ్రంథాంతరమందు జెప్పియుండుటవలన ఈ వివాహనిషేధము పురుషుని విషయమని తెలియదగినది.

## వివాహానంతరము చేయరాని కృత్యములు

కుటుంబమునందొకరికి వివాహముజరిగిన ఆరుమాసములలోగా చెవులు కుట్టుట, ఉపనయనము, తీర్థయాత్ర, వ్రతములు, ఉద్యాపనము మొదలైన కార్యములు పనికిరావు.

"కర్ణవేధన మౌంజ్యాది తీర్థయాత్రాది వేశ్మని। వ్రతోద్యాపనకర్మాణి నిందితాని మహర్షిభిః ॥"

## ఖ చ ర యో గ ము

శ్లో॥ రవినక్షత్రమారభ్య చంద్రక్షాన్తంచ గణ్యతే। నవ త్రీణి చతుః పంచ యోగోఽయం ఖచరం విదుః॥
ఉపనీతౌ వటోర్నాశస్సీమంతే చ శిశుక్షయః। వివాహే విధవా నారీ ప్రయాణే మరణం ధ్రువమ్॥

తా॥ సూర్యుడుండెడి నక్షత్రమునుండి చంద్రుడుండు నక్షత్రపర్యంతం తొమ్మిదివరకు యెంచి ౯-౩-౪-౫ ఈ నాల్గున్ను ఖచరములు. వీట్లలో శుభకర్మలు చేసిన ఉపనయనములో వటువునాశము. సీమంతములో శిశునాశము. వివాహములో కన్య విధవయగును. యాత్రలో మరణము సిద్ధించును.

## వై నా శి క యో గ ము

శ్లో॥ వైనాశికాఖ్యనక్షత్రే వ్యష్టాశీతితమోఽంశకః। శేషాంశాశ్శుభదాస్సర్వే కేచిదృక్షవివర్జితమ్ ॥

తా॥ జన్మనక్షత్రమునకు ౮౦-వ పాదం (అనగా ౨౦-వ నక్షత్రము) సర్వకర్మలకు, వైనాశికము. దీనిలో వర్జించ తగినవి. కొందరు ఋషుల మతము ఆ నక్షత్రము పూర్తిగానే పనికిరాదని అభిప్రాయము.

ఔషధసేవ చేయుటకు ॥ శుభవారములు,—ఆది - మంగళ - గురు - శుక్ర వారములు.

శుభనక్షత్రములు ॥ అశ్వి. మృ. పున. పుష్య. హ. చి. స్వా. అనూ. మూ. శ్ర. ధ. శత. రే.

తైలాభ్యంజనము ॥ శ్లో॥ నిషిద్ధ తిథివారర్క్షగ్రహణేష్వపి రాత్రిషు। కించిద్గోఘృత సంయుక్తం విప్రపాద రజోన్వితం। సార్షపం గంధతైలంచ యత్తైలం పుష్పవాసితం । అన్యద్రవ్యయుతం తైలం న దుష్యతి కదాచన॥ తైలాభ్యంజనమునకు వ్రతదినములు శ్రాద్ధదినములు మొదలగువానిని విడిచి సామాన్యశుభదినములయందు తైలమున ఆవు నెయ్యినిగాని సుగంధాది వస్తువులనుగాని చేర్చి అభ్యంజనము చేసుకొనవచ్చును.

క్షౌరమునకు శుభ తిథులు॥ ద్వి-తృ-పం-సప్త-దశ-త్రయో. శుభవారములు॥ సో॥ ౭-బు ౫-గు ౧-శు ౧౧ మాసములు ఆయుర్వృద్ధి యగును. శుభనక్షత్రములు॥ అశ్వి-మృ-పున-పుష్య-హ-చి-స్వా-జ్యే-శ్ర-ధ శత-రే. ప్రాతఃకాలము భోజనాత్పూర్వము కూర్చొనక ఉత్తరముఖముగా కూర్చుని దక్షిణకర్ణము మొదలు క్షౌరము చేసుకోదగినది. కాశ్యాది పుణ్య క్షేత్ర ప్రవేశకాలమందు, రాజాజ్ఞలందు, వివాహ యజ్ఞాది దీక్షల యందు, మృతసూతక ప్రాయశ్చిత్తాదులయందును నిషిద్ధ తిథివారమైనను క్షౌరము చేసుకొనవచ్చును.

త్యాజ్యస్వరూపము—గార్ధభముఖము, సర్పనేత్రములు, సింహకంఠము, సప్తభుజములు, తోకవంటి చేతులు, కృశించిన ఉదరము, మూడుపాదములుగల ఈత్యాజ్య స్వరూపము పంచాంగ తిథ్యాదులలో ది. ౫ రా.౫ అని వ్రాసియుండు ఘడియలు మొదలు సుమారు ౪ ఘడియల కాలముండును. నక్షత్రాద్యంత ఘడియలను ౧౫ తో భాగించిన లబ్ధము త్యాజ్య స్వరూపకాలము. ఈ కాలము నక్షత్రములకు ఋతుకాలము. ఇందు శుభకార్యములు చేయకూడదు.

## రోగులకు పీడాంగజ్ఞానవివరము

| నక్షత్రములు | అంగవిభాగములు | నక్షత్రములు | అంగవిభాగములు | నక్షత్రములు | అంగవిభాగములు |
|---|---|---|---|---|---|
| కృత్తికకు | శిరము | ఉత్తరకు | కంఠము | ఉత్తరాషాఢకు | మోకాళ్లు |
| రోహిణికి | లలాటము | హస్తకు | రొమ్ము | శ్రవణమునకు | పిక్కలు |
| మృగశిరకు | భ్రూయుగ్మం | చిత్తకు | చన్నులు | ధనిష్ఠకు | కాళ్లసంధులు |
| ఆర్ద్రకు | నేత్రములు | స్వాతికి | కడుపు | శతభిషమునకు | అరికాలు |
| పునర్వసుకు | నాసికములు | విశాఖకు | నడుము | పూర్వాభాద్రకు | కుడికాలు |
| పుష్యమికి | కర్ణము | అనూరాధకు | పిరుదులు | ఉత్తరాభాద్రకు | గుల్ఫములు |
| ఆశ్లేషకు | అధరము | జ్యేష్ఠకు | శిశ్నము | రేవతికి | మీగాళ్లు |
| మఖకు | చుబుకము | మూలకు | అండములు | అశ్వనికి | నఖములు |
| పుబ్బకు | చేతివ్రేళ్లు | పూర్వాషాఢకు | తొడలు | భరణికి | వ్రేళ్లు |

### జ్ఞానప్రదీపికాయామ్

శ్లో॥ శిరోలలాటభ్రూనేత్రనాసికాశ్రుతయోఽధరః। చుబుకాంగుళిరిత్యేవం కృత్తికాద్యుడవోనవ।
కంఠవక్షఃస్థలకుచోదరమధ్యనితంబకః। శిశ్నమండౌగవఃప్రోక్తా శ్చోత్తరాద్యా నవోడవః।
జానుజంఘాపాదసంధిః పృష్ఠాస్యఃస్థలగుల్ఫకం। పాదాగ్రనఖరాంగుళ్యో వైశ్వాద్యాశ్చోడవో నవ॥

## తప్పిపోయినవాడు జీవించియున్నాడా లేదా అను ప్రశ్న

ఉదయాది ఘటీత్రిఘ్నం తిథివారేణ సంయుతమ్। అర్క-సంఖ్యాహరేచ్ఛేషం జీవనిర్జీవసంజ్ఞకమ్।
రామబాణ రసాదంతి నందరుద్రాస్సజీవతి। రూపపక్షయుగద్వీపదశభాను ర్నజీవతి॥

తా॥ ప్రశ్నచేయబడిన దినమున సూర్యోదయము మొదలు ప్రశ్నకాలమువరకు అయిన ఘడియలను మూడుచేత గుణించి, యా మొత్తముతో శుక్లపాద్యమి మొదలు ఆ దినమువరకైన దినసంఖ్యను కలిపి, ఆ మొత్తమును పంద్రెండుచేత భాగించగా ౩-౫-౬-౮-౯-౧౧ మిగిలెనేని తప్పిపోయినవాడు జీవించి యున్నాడనియు, ౧-౨-౪-౭-౧౦-౧౨ మిగిలెనేని తప్పిపోయినవాడు మృతినొందెననియును తెలియవలెను,

# గౌళిపతన (బల్లిపాటు) ఫలములు

| స్థానములు | ఫలములు | స్థానములు | ఫలములు |
|---|---|---|---|
| చెవిమీద | దుర్వార్తవినుట | మణిబంధమున | గర్వభంగము |
| కనుబొమలమీద | ధనలాభము | గోళ్లయందు | జంతుభయము |
| కనుబొమలమధ్య | కలహసూచకము, దైవిక-భయము | చంకలో | ప్రేతభయము |
| కుడికన్నున | పరాజయము | వెన్నున | శత్రుభయము |
| ఎడమకన్నున | అవమానము | వెన్నెముకయందు | పిశాచభయము |
| ముక్కుమీద | కార్యహాని | నడుమువెనుక | వస్త్రలాభము |
| ముక్కుకొనయందు | పరాజయము | పిరుదున | శయ్యాలాభము |
| ముక్కుప్రక్కన | మిత్రలాభము | తొడవెనుక | విషభయము |
| మీసముమీద | అధికారలాభము | ముందొడమీద | సుఖము |
| పైపెదవిమీద | భూలాభము | స్త్రీకి తొడమీద | వ్యభిచారము |
| క్రిందిపెదవిమీద | సుభోజనము | తొడ మొదట | బలహీనము |
| నాలుకయందు | విద్యాలాభము | శిశ్నమందు | సంతానము |
| గడ్డముమీద | అపమృత్యువు | శిశ్నాగ్రమున | దాంపత్యభంగము |
| గండములమీద | భూమినష్టము | శిశ్నరోమములందు | దేశభ్రమణము |
| గడ్డము వెంట్రుకలమీద | కారాగృహప్రాప్తి | వృషణములయందు ను దానికిదిగువను | చోరత్వము |
| వెనుక మెడయందు | మరణభయము | గుదమందు | ఆయుధభయము |
| ముందువైపు కంఠమందు | బుద్ధినాశనము, ఆత్మ-హత్య, భయము | మోకాలియందు | వాహనలాభము |
| గొంతుయెముకమీద | ఉభయసంకటములు | మోకాలిసంధియందు | వాహనభ్రంశము |
| రొమ్మున | జయము | మోకాలిక్రింద | వాతరోగము |
| గుండెలోన | అధైర్యము | మోకాలిక్రింద-నరములయందు | రోగమూలా-ద్ధనవ్యయము |
| పైకడుపున | పుత్రలాభము | పిక్కలయందు | కార్యానుకూలము |
| బొడ్డున | భయము | మోకాలి క్రింది యెముకమీద | వ్యాపారలాభము |
| బొడ్డునకుదిగువున | రోగము | పాదములయెముకమీద | కార్యహాని |
| కడుపుప్రక్కన | ఆరోగ్యము | పాదసంధియందు | రోగము |
| భుజములయందు | సహాయము | పాదములవెనుక | కారాగృహప్రవేశము |
| రెట్టలయందు | యత్న కార్యభంగము | పాదమున | ప్రయాణము |
| అరచేతియందు | ద్రవ్యలాభము | వ్రేళ్ళయందు | రోగము |
| మోచేతియందు | సహాయనాశము | అరికాలియందు | రాజ్యలాభము |

## గౌళిపతన (బల్లిపాటు) ఫలములు

| స్థానములు | ఫలములు | స్థానములు | ఫలములు |
|---|---|---|---|
| తలమీద బ్రహ్మరంధ్రమునకు వెనుక బల్లి పడిన | లక్ష్మీకరము | జుట్టుమీద | కష్టము |
| | | జడమీద | పతికి మృత్యువు |
| నడినెత్తిమీద | రోగము | ముచ్చిలిగుంటలో | భారము మోయుట |
| కుడినెత్తిమీద | సోదరునికి భయము | పాదమందు | కల్యాణము |
| నెత్తి వెనుక | తమ్మునికరిష్టము | గండస్థలమందు పురుషులకు | బంధువులువత్తురు - శుభ |
| బ్రహ్మరంధ్రమునకు ముందు | మేనమామకు చేటు | ,, స్త్రీలకు | అశుభము [కార్యసూచకం |
| బ్రహ్మరంధ్రమున | మృత్యుభయము | స్త్రీలకు చెవిదగ్గర చెంప మీద | శుభము |
| ముఖమునకు యెగువ | ధనలాభము | | |
| ముంగురులమీద | హాని | తలమునుకుల మీద స్త్రీకైతే | కీడు సంభవించును వైధవ్యసూచకం |
| కేశాంతమందు | అనాయాసమరణము | | |

## బల్లిపలుకులు, నక్క అరుపు, తుమ్ము వీట్ల ఫలములు

| దిక్కులు | ఆది వారము | సోమ వారము | మంగళ వారము | బుధ వారము | గురు వారము | శుక్ర వారము | శనివారము |
|---|---|---|---|---|---|---|---|
| తూర్పు | భయము | ధనలాభం | సంపద | సంతోషము | అశుభం | శుభవార్త | శుభవార్త |
| ఆగ్నేయం | మృతివార్త | కలహము | బంధులాభం | ధనలాభం | బంధుసన్మానం | అలంకారం | గంధలాభం |
| దక్షిణం | సుఖము | ద్వేషము | సుఖవార్త | వ్యాధి | ధనలాభం | బంధుదర్శనం | రాజదర్శనం |
| నైఋతి | బంధుదర్శనం | హానివార్త | శత్రుభయం | బంధుహాని | సర్వార్థసిద్ధి | శుభవార్త | రోగప్రాప్తి |
| పశ్చిమం | కలహము | రాజసన్మానం | అనుకూలం | భయం | నష్టము | సంతోషము | నూతనవస్త్రలాభము |
| వాయవ్యం | వస్త్రలాభము | అమంగళం | దూరదేశవార్త | అర్థనాశనం | శుభవార్త | గృహచ్ఛిద్రం | నవస్త్రీరతి |
| ఉత్తరం | కలహము | వస్త్రలాభము | శత్రుభయం | సుఖము | కార్యహాని | కలహం | ప్రియవార్త |
| ఈశాన్యం | లాభవార్త | శుభవార్త | వాహనారోహణం | కార్యభంగం | భోజనసుఖం | శత్రుభయం | చోరాగమనం |
| ఊర్ధ్వం | జయము | హానివార్త | యాత్ర | శుభవార్త | కలహము | వస్త్రలాభం | కార్యహాని |
| అధోదిక్కు | కార్యసిద్ధి | ఐశ్వర్యప్రాప్తి | విశేషధనలాభం | ఐశ్వర్యప్రాప్తి | కలహము | నూతనస్నానం | సకలకార్యసిద్ధి |

## రోగాంగవిభాగస్థానచక్రము.

| రాసులకు | రోగాంగవిభాగ స్థానములు | గ్రహములకు | రోగాంగవిభాగ స్థానములు |
|---|---|---|---|
| మేషమునకు | శిరము | కుజునకు | శిరము |
| వృషభమునకు | ముఖము | శుక్రునకు | ముఖము |
| మిథునమునకు | భుజము | బుధునకు | మెడ, చేతులు |
| కటకమునకు | కరతలము | చంద్రునకు | రొమ్ము |
| సింహమునకు | రొమ్ము | సూర్యునకు | కడుపు |
| కన్యకు | కుచములు | గురువునకు | నాభిక్రింది చోటు |
| తులకు | కడుపు | శనికి | తొడలు |
| వృశ్చికమునకు | నడుము | రాహువునకు | కాళ్లు |
| ధనుస్సునకు | లోగొడలు | | |
| మకరమునకు | అపానద్వారము, లింగము, యోని మొదలగు చోటులు | | |
| కుంభమునకు | తొడలు | | |
| మీనమునకు | పాదములు | | |

శ్లో॥ పృష్ఠోదయాత్మకే తచ్ఛత్రేవ్యాధిమోక్షో న జాయతే। వ్యాధిస్థానమిదం ప్రాహుర్మూర్ధ్నివక్త్రే భుజేకరే। వక్షసి స్తనయోఃకుక్షౌకట్యాం మూలే చ మేహనే। ఊరౌ పాదే చ మేషాద్యాః రాశయః పరికీర్తితాః॥ కుజో మూర్ధ్ని ముఖే శుక్రః కంధరాభుజయోర్బుధః। చన్ద్రో వక్షసి కుక్షౌ తు భానుర్నాభేరధో గురుః। ఊరౌ శని రహూః పాదే గ్రహాణాం స్థానమీరితం। ఏతేష్వేవ స్థలేషు స్యాన్నష్టమేతేషు రాశిషు॥

## గ్రహకాలహోర (ప్రతిహోర సూర్యోదయము మొదలు ఒక్కొక్క గంటకాలము.)

| వారం | 6మొ 7వ | 7-8 | 8-9 | 9-10 | 10-11 | 11-12 | 12-1 | 1-2 | 2-3 | 3-4 | 4-5 | 5-6 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ఆది | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని |
| సోమ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య |
| మంగళ | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర |
| బుధ | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ |
| గురు | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ |
| శుక్ర | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు |
| శని | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర |

| | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ఆది | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ |
| సోమ | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు |
| మంగళ | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర |
| బుధ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని |
| గురు | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య |
| శుక్ర | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర |
| శని | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ |

ఈకాలహోరకు పైవి పగటి ముహూర్తములు క్రిందివి రాత్రి ముహూర్తములు. వీనిలో చంద్ర శుక్ర హోరలుశుభఫలమును, బుధ కుజ హోరలు మధ్యమఫలమును, సూర్య శని హోరలు అధమ ఫలమును యిచ్చును. చంద్ర గురు శుక్ర హోరలయందు రాహుకాలముగానుండినను కార్యానుకూలంగానుండును. క్షీణచంద్రుడు, పాపసహిత బుధుడు వీరుపాపులు.

## గౌరీపంచాంగము. కాలము ౧-కి ౩¾ ఘడియ- పగటిముహూర్తముఃలు ౮ కి

| కాలం | ఆది | సోమ | మంగళ | బుధ | గురు | శుక్ర | శని |
|---|---|---|---|---|---|---|---|
| ౩¾ | ఉద్యోగం | అమృతం | రోగం | విషం | ఉద్యోగం | రోగం | విషం |
| ౭½ | లాభం | విషం | ఉద్యోగం | అమృతం | విషం | జ్వరం | అమృతం |
| ౧౧¼ | విషం | ఉద్యోగం | జ్వరం | శుభం | జ్వరం | అమృతం | జ్వరం |
| ౧౫ | అమృతం | లాభం | లాభం | ఉద్యోగం | లాభం | కలహం | ఉద్యోగం |
| ౧౮¾ | శుభం | జ్వరం | అమృతం | రోగం | అమృతం | లాభం | శుభం |
| ౨౨½ | ధనం | అమృతం | ఉద్యోగం | శుభం | విషం | సుఖం | లాభం |
| ౨౬¼ | అమృతం | లాభం | విషం | ధనం | కలహం | ధనం | ధనం |
| ౩౦ | విషం | ధనం | లాభం | అమృతం | జ్వరం | అమృతం | లాభం |

## రాత్రి ముహూర్తములు ౮ కి

| కాలం | ఆది | సోమ | మంగళ | బుధ | గురు | శుక్ర | శని |
|---|---|---|---|---|---|---|---|
| ౩¾ | శుభం | రోగం | జ్వరం | లాభం | శుభం | అమృతం | విషం |
| ౭½ | అమృతం | లాభం | ఉద్యోగం | రోగం | రోగం | జ్వరం | ఉద్యోగం |
| ౧౧¼ | జ్వరం | ఉద్యోగం | కలహం | విషం | కలహం | కలహం | శుభం |
| ౧౫ | రోగం | ధనం | లాభం | ఉద్యోగం | లాభం | లాభం | అమృతం |
| ౧౮¾ | కలహం | రోగం | రోగం | శుభం | ఉద్యోగం | శుభం | కలహం |
| ౨౨½ | లాభం | అమృతం | లాభం | లాభం | జ్వరం | ధనం | రోగం |
| ౨౬¼ | ఉద్యోగం | విషం | ఉద్యోగం | ధనం | లాభం | అమృతం | అమృతం |
| ౩౦ | జ్వరం | జ్వరం | ధనం | లాభం | ఉద్యోగం | విషం | లాభం |

శ్లోకం॥ న తిథి ర్న చ నక్షత్రం న యోగం కరణం తథా। న హోరా యోగినీ చక్రం న లగ్నం న తమోగుణః॥ వ్యతీపాతే చ సంక్రాన్తౌ భద్రాయామశుభే దినే। శివార్చనం సమాలోక్య సర్వత్ర విజయీభవేత్॥

## పురశ్శుక్ర దోషములు

గర్భిణీస్త్రీ, శిశువహితస్త్రీ, నూతనవధువు వీర్లు శుక్రుడు తూర్పుదిక్కున నున్నప్పుడు పశ్చిమ దిక్కునుండి వాయవ్యదిక్కునకు, ఉత్తరమునకు, ఈశాన్యమునకు తూర్పు దిక్కునకు ప్రయాణము పోకూడదు. పశ్చిమదిక్కున శుక్రుడున్నప్పుడు తూర్పు, ఆగ్నేయము, దక్షిణము, నైఋతి పశ్చిమములకు ప్రయాణముపోకూడదు. ఏకగ్రామమందు ఈదోషములేదు. దుర్భిక్ష, రాజవిద్వర, వివాహ తీర్థయాత్రలలో ఈదోషము వర్తింపదు.

## రాహుకాలము.

| వారములు. | ఘంటలు మొదలు | ఘంటలు వరకు |
|---|---|---|
| ఆది ... | 4½ | 6 |
| సోమ ... | 7½ | 9 |
| మంగళ ... | 3 | 4½ |
| బుధ ... | 12 | 1½ |
| గురు ... | 1½ | 3 |
| శుక్ర ... | 10½ | 12 |
| శని ... | 9 | 10½ |

## యమకంటకకాలము.

| వారములు. | ఘంటలు మొదలు | ఘంటలు వరకు |
|---|---|---|
| ఆది ... | 12 | 1½ |
| సోమ ... | 10½ | 12 |
| మంగళ ... | 9 | 10½ |
| బుధ ... | 7½ | 9 |
| గురు ... | 6 | 7½ |
| శుక్ర ... | 3 | 4½ |
| శని ... | 1½ | 3 |

## గుళికకాలము.

| వారములు. | ఘంటలు మొదలు | ఘంటలు వరకు |
|---|---|---|
| ఆది ... | 3 | 4½ |
| సోమ ... | 1½ | 3 |
| మంగళ ... | 12 | 1½ |
| బుధ ... | 10½ | 12 |
| గురు ... | 9 | 10½ |
| శుక్ర ... | 7½ | 9 |
| శని ... | 6 | 7½ |

ఉదయం ౬ ఘంటల మొదలు కాలం ౧ కి ౧½ ఘంటవంతున సాయంత్రం ౬ ఘంటలవరకు ౭ కాలములు ప్రతిదినము ఆవారాధిపతి మొదలు రవి కుజ గురు బుధ శుక్ర శని చంద్ర రాహువులు క్రమముగా ౭ కాలములకు అధిపతులు. పాపగ్రహాధిపత్య కాలములు, రాహుకాలము శుభ కార్యములకు మిక్కిలి వర్జింపతగినవి.

శ్రీవేంకటాచలమునకు చరఖండములు ౩౦—౨౪—౧౦, విషువచ్ఛాయ—అంగుళములు ౩
భూమధ్యరేఖకు 650 మైళ్ళు. దివా ప్రమాణము ౨౭—౧౦
రాత్రి ప్రమాణము ౩౧—౫౦ అహోరాత్రప్రమాణము ౬౦—౧౦

శ్రీ శేషాద్రియం దవతరించి ఈ కలియుగమున భక్తకోటికి సర్వాభీష్టము లొసంగుచుండు శ్రీ వేంకటేశ్వరునికి నివాసస్థానమైన తిరుపతికి మేషాదిలగ్న ప్రమాణములు.

| | ఘ. | వి. | | ఘ. | వి. |
|---|---|---|---|---|---|
| మేషం | ౪ | ౭ | తుల | ౫ | ౭ |
| వృషభం | ౪ | ౩౫ | వృశ్చికం | ౫ | ౨౩ |
| మిథునం | ౫ | ౧౩ | ధనుస్సు | ౫ | ౩౩ |
| కర్కాటక | ౫ | ౩౩ | మకరం | ౫ | ౧౩ |
| సింహం | ౫ | ౨౩ | కుంభం | ౪ | ౩౫ |
| కన్య | ౫ | ౭ | మీనం | ౪ | ౭ |

ఈ మేషాది లగ్న ప్రమాణములు ఈ చిత్తూరుజిల్లాయందు, చెన్నపట్టణం, చెంగల్పట్టు, వేలూరు, బెంగళూరు, కడప, నెల్లూరు జిల్లాయందు ముఖ్యముగా చూడతగినవి తిరుపతి. విషువచ్ఛాయా భూరేఖా ప్రాగ్యోజనములు ౩౦

### ఉదయాస్తమయ ఘం॥

| నె. 1 తే | ఉదయం ఘం. ని. | అస్తు ఘం. ని |
|---|---|---|
| జనవరి | 6 35 | 5 50 |
| ఫిబ్రవరి | 6 39 | 6 8 |
| మార్చి | 6 29 | 6 15 |
| ఏప్రల్ | 6 10 | 6 18 |
| మే | 5 52 | 6 21 |
| జూన్ | 5 45 | 6 28 |
| జూలై | 5 50 | 6 35 |
| ఆగస్టు | 5 57 | 6 31 |
| సెప్టంబ | 6 1 | 6 18 |
| అక్టోబ | 6 2 | 5 53 |
| నవంబ | 6 6 | 5 39 |
| డిసంబ | 6 19 | 5 37 |

ఈ సూర్యోదయాస్తమయ ఘంటలు యీ పంచాంగాహర్మానమునకు సరియైనవి. రాత్రి ఘంటలోసుమారు 8 నిమిషములు చేర్చిన (లంకార్ధరాత్రి) వారారంభమగును. ప్రతిదినము వారాధిపతి మొదలు ర-శు-బు-చం-శ-గు-కు ఈ 7 గ్రహములు 1 ఘంటకు 1 గ్రహమువంతున వారారంభము మొదలు 24 ఘంటలకు పర్యాయ క్రమముగా కాలహోరాధిపతులు. ఇది సూర్యసిద్ధాంత ప్రమాణము. శుభ గ్రహాధిపత్య ఘంటలు వివాహాదులకు శుభమైనవి.

## వింధ్యకు దక్షిణదేశమందు వాడబడుచుండెడి వింశోత్తరీదశాన్తర్దశా చక్రము.

| భుక్తులు | సూర్యమహాదశా సం॥౬ | | | భుక్తులు | చన్ద్రమహాదశా సం॥ ౧౦ | | | భుక్తులు | కుజమహాదశా సం॥ ౭ | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | సం. | మా. | ది. | | సం. | మా. | ది. | | సం. | మా. | ది. |
| రవి | ౦ | ౩ | ౧౮ | చన్ద్ర | ౦ | ౧౦ | ౦ | కుజ | ౦ | ౪ | ౨౭ |
| చన్ద్ర | ౦ | ౬ | ౦ | కుజ | ౦ | ౭ | ౦ | రాహు | ౧ | ౦ | ౧౮ |
| కుజ | ౦ | ౪ | ౬ | రాహు | ౧ | ౬ | ౦ | గురు | ౦ | ౧౧ | ౬ |
| రాహు | ౦ | ౧౦ | ౨౪ | గురు | ౧ | ౪ | ౦ | శని | ౧ | ౧ | ౯ |
| గురు | ౦ | ౯ | ౧౮ | శని | ౧ | ౭ | ౦ | బుధ | ౦ | ౧౧ | ౨౭ |
| శని | ౦ | ౧౧ | ౧౨ | బుధ | ౧ | ౫ | ౦ | కేతు | ౦ | ౪ | ౨౭ |
| బుధ | ౦ | ౧౦ | ౬ | కేతు | ౦ | ౭ | ౦ | శుక్ర | ౧ | ౨ | ౦ |
| కేతు | ౦ | ౪ | ౬ | శుక్ర | ౧ | ౮ | ౦ | రవి | ౦ | ౪ | ౬ |
| శుక్ర | ౧ | ౦ | ౦ | రవి | ౦ | ౬ | ౦ | చన్ద్ర | ౦ | ౭ | ౦ |

| భుక్తులు | రాహుమహాదశాసం॥ ౧౮ | | | భుక్తులు | గురుమహాదశా సం॥ ౧౬ | | | భుక్తులు | శనిమహాదశాసం॥౧౯ | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | సం. | మా. | ది. | | సం. | మా. | ది. | | సం. | మా. | ది |
| రాహు | ౨ | ౮ | ౧౨ | గురు | ౨ | ౧ | ౧౮ | శని | ౩ | ౦ | ౩ |
| గురు | ౨ | ౪ | ౨౪ | శని | ౨ | ౬ | ౧౨ | బుధ | ౨ | ౮ | ౯ |
| శని | ౨ | ౧౦ | ౬ | బుధ | ౨ | ౩ | ౬ | కేతు | ౧ | ౧ | ౯ |
| బుధ | ౨ | ౬ | ౧౮ | కేతు | ౦ | ౧౧ | ౬ | శుక్ర | ౩ | ౨ | ౦ |
| కేతు | ౧ | ౦ | ౧౮ | శుక్ర | ౨ | ౮ | ౦ | రవి | ౦ | ౧౧ | ౧౨ |
| శుక్ర | ౩ | ౦ | ౦ | రవి | ౦ | ౯ | ౧౮ | చన్ద్ర | ౧ | ౭ | ౦ |
| రవి | ౦ | ౧౦ | ౨౪ | చన్ద్ర | ౧ | ౪ | ౦ | కుజ | ౧ | ౧ | ౯ |
| చన్ద్ర | ౧ | ౬ | ౦ | కుజ | ౦ | ౧౧ | ౬ | రాహు | ౨ | ౧౦ | ౬ |
| కుజ | ౧ | ౦ | ౧౮ | రాహు | ౨ | ౪ | ౨౪ | గురు | ౨ | ౬ | ౧౨ |

| భుక్తులు | బుధమహాదశాసం॥ ౧౭ | | | భుక్తులు | కేతుమహాదశా సం॥ ౭ | | | భుక్తులు | శుక్రమహాదశా సం॥ ౨౦ | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | సం. | మా. | ది. | | సం. | మా. | ది. | | సం. | మా. | ది. |
| బుధ | ౨ | ౪ | ౨౭ | కేతు | ౦ | ౪ | ౨౭ | శుక్ర | ౩ | ౪ | ౦ |
| కేతు | ౦ | ౧౧ | ౨౭ | శుక్ర | ౧ | ౨ | ౦ | రవి | ౧ | ౦ | ౦ |
| శుక్ర | ౨ | ౧౦ | ౦ | రవి | ౦ | ౪ | ౬ | చన్ద్ర | ౧ | ౮ | ౦ |
| రవి | ౦ | ౧౦ | ౬ | చన్ద్ర | ౦ | ౭ | ౦ | కుజ | ౧ | ౨ | ౦ |
| చన్ద్ర | ౧ | ౫ | ౦ | కుజ | ౦ | ౪ | ౨౭ | రాహు | ౩ | ౦ | ౦ |
| కుజ | ౦ | ౧౧ | ౨౭ | రాహు | ౧ | ౦ | ౧౮ | గురు | ౨ | ౮ | ౦ |
| రాహు | ౨ | ౬ | ౧౮ | గురు | ౦ | ౧౧ | ౬ | శని | ౩ | ౨ | ౦ |
| గురు | ౨ | ౩ | ౬ | శని | ౧ | ౧ | ౯ | బుధ | ౨ | ౧౦ | ౦ |
| శని | ౨ | ౮ | ౯ | బుధ | ౦ | ౧౧ | ౨౭ | కేతు | ౧ | ౨ | ౦ |

| దశాధిపతులు | రవి | చంద్ర | కుజ | రాహు | గురు | శని | బుధ | కేతు | శుక్ర |
|---|---|---|---|---|---|---|---|---|---|
| దశాప్రమాణ దినములు | ౧౮ | ౩౦ | ౨౧ | ౫౪ | ౪౮ | ౫౭ | ౫౧ | ౨౧ | ౬౦ |

రవిదశాఫలం—శ్లో॥ రాజ్ఞాంవార్తా ప్రసంగా ప్తిముష్ణాధిక్యం మనోరుజం। పత్రికాదర్శనం దూర సంచారం నేత్రరోగతా। అపూర్వవార్తాశ్రవణం జీర్ణవస్త్రాదిధారణం। కరోతి మనుజానాం తు రవే ర్వర్ష దశాఫలం ॥ ౧ ॥

చంద్రదశాఫలం—శ్లో॥ విద్యావినోదగోష్ఠీంచ వేదశాస్త్రాదిచింతనం। పురాణశ్రవణం చైవ దూర బంధుసమాగమం। శుక్లవస్త్రాద్యలంకారం మాతృహస్తాన్న భోజనం। తీర్థయాత్రాప్రసంగంచ దద్యాచ్చంద్ర దశాఫలం ॥ ౨ ॥

కుజదశాఫలం—శ్లో॥ భోజనం కటుకాద్యైశ్చ ఉద్యోగే విఘ్నసంభవః। మనఃక్లేశం మహత్కష్టం శరీరే రక్తదర్శనం। పరనిందాపవాదంచ కలహం శాత్రవైర్జనైః। ఏవం కరోతిభౌమస్య సంవత్సరదశాఫలం॥ ౩॥

రాహుదశాఫలం—శ్లో॥ అకస్మాత్కలహం నిత్యమరివర్గప్రపీడనం। సర్పవృశ్చిక దుస్స్వప్న సాధ్వసం పైత్యసంభవం। విషవైద్యప్రహారం చ మ్లేచ్ఛప్రభుసమాగమం। ఏవం రాహుదశా నృణాం కరోత్యత్ర న సంశయః ॥ ౪ ॥

గురుదశాఫలం—శ్లో॥ దేహారోగ్యం సుఖం చైవ బ్రాహ్మణానాం సమాగమః। నూతనాంబర గో లాభం పుత్రలాలనమన్వహం। ధనలాభశ్చ సంతోషో రాజప్రీతికరం సదా। గ్రామాంతరాద్ధాన్యలాభో జీవస్యైవ దశాఫలం ॥ ౫ ॥

శనిదశాఫలం—శ్లో॥ మృతివార్తాప్రసంగశ్చ దేహజాడ్యం భయాస్పదం। హీనజాతివిరోధశ్చ హృదయవ్యాధిసంభవం। భ్రాతృభృత్యాది కలహం హీనకార్య ప్రవర్తనం। శనేర్వర్ష ఫలం దద్యాన్మనుజానా మహర్నిశం ॥ ౬ ॥

బుధదశాఫలం—శ్లో॥ విద్యాలాభం భూషణాప్తిం నృపద్విజగురుప్రియం। పత్రికాగమనం బంధు సదనే భోజనం సదా। మిత్రమూలాత్కార్యసిద్ధిం చిత్రాంబరవిభూషణం। ప్రదదాత్యనిశం నృణాం బుధ వర్షదశా ఫలం ॥ ౭ ॥

కేతుదశాఫలం—శ్లో॥ శత్రువృద్ధిం సుహృత్పీడాం రాజకోపం మహద్భయం। చోరభీతిం మనఃక్లేశం చతుష్పాద్భయమేవ చ। భైషజ్యం జ్వరతాపం చ గోమహిష్యాదినాశనం। క్వచిత్సుఖం క్వచిద్దుఃఖః కేతోస్తు ఫలమాదిశేత్ ॥ ౮ ॥

శుక్రదశాఫలం—శ్లో॥ సద్వస్త్రధారణం సౌఖ్యం బాలస్త్రీ చుంబనం తథా। నృత్తగీత ప్రసంగం చ వేశ్యాస్త్రీభోగసంభవం। కావ్యాలంకారశాస్త్రాదికాలయాపనమన్వహం। కురుతే మానవానాం తు శుక్రవర్ష దశాఫలం ॥ ౯ ॥

## ప్రయాణమునకు ఆనందాదియోగములు

| వారము / యోగములు | ఆది | సోమ | మంగళ | బుధ | గురు | శుక్ర | శని | ఫలములు |
|---|---|---|---|---|---|---|---|---|
| ఆనందయోగము | అ | మృ | ఆ | హ | అనూ | ఉ-షా | శ | ద్రవ్యలాభము |
| కాలదండయోగము | భ | ఆరు | మ | చి | జ్యే | అభి | పూ-భా | విఘ్నము |
| ధూమ్రయోగము | కృ | పున | పూ-ఫ | స్వా | మూ | శ్ర | ఉ-భా | హాని |
| ధాతృయోగము | రో | పు | ఉ | వి | పూ-షా | ధ | రే | కార్యసిద్ధి |
| సౌమ్యయోగము | మృ | ఆ | హ | అనూ | ఉ-షా | శ | అ | సుఖము |
| ధ్వాంక్షయోగము | ఆరు | మ | చి | జ్యే | అభి | పూ-భా | భ | విఘ్నము |
| ధ్వజయోగము | పున | పూ-ఫ | స్వా | మూ | శ్ర | ఉ-భా | కృ | రాజ్యలాభము |
| శ్రీవత్సయోగము | పు | ఉ-ఫ | వి | పూ-షా | ధ | రే | రో | లక్ష్మీప్రదము |
| వజ్రయోగము | ఆ | హ | అనూ | ఉ-షా | శ | అ | మృ | కలహము |
| ముద్గరయోగము | మ | చి | జ్యే | అభి | పూ-భా | భ | ఆరు | మరణము |
| ఛత్రయోగము | పూ-ఫ | స్వా | మూ | శ్ర | ఉ-భా | కృ | పున | రాజ్యలాభము |
| మిత్రయోగము | ఉ-ఫ | వి | పూ-షా | ధ | రే | రో | పు | కార్యసిద్ధి |
| మానసయోగము | హ | అనూ | ఉ-షా | శ | అ | మృ | ఆ | స్త్రీలాభము |
| పద్మయోగము | చి | జ్యే | అభి | పూ-భా | భ | ఆరు | మ | ఐశ్వర్యము |
| లంబయోగము | స్వా | మూ | శ్ర | ఉ-భా | కృ | పున | పూ-ఫ | కార్యహాని |
| ఉత్పాతయోగము | వి | పూ-షా | ధ | రే | రో | పు | ఉ-ఫ | ద్రవ్యనాశనము |
| మృత్యుయోగము | అనూ | ఉ-షా | శ | అ | మృ | ఆ | హ | హాని |
| కాలయోగము | జ్యే | అభి | పూ-భా | భ | ఆరు | మ | చి | కార్యహాని |
| సిద్ధయోగము | మూ | శ్ర | ఉ-భా | కృ | పున | పూ-ఫ | స్వా | కార్యసిద్ధి |
| శుభయోగము | పూ-షా | ధ | రే | రో | పు | ఉ-ఫ | వి | శుభకార్యసిద్ధి |
| అమృతయోగము | ఉ-షా | శ | అ | మృ | ఆ | హ | అనూ | స్త్రీసంతోషము |
| ముసలయోగము | అభి | పూ-భా | భ | ఆరు | మ | చి | జ్యే | భోజనహాని |
| గదాయోగము | శ్ర | ఉ-భా | కృ | పున | పూ-ఫ | స్వా | మూ | అశుభము |
| మాతంగయోగము | ధ | రే | రో | పు | ఉ-ఫ | వి | పూ-షా | స్వర్ణలాభము |
| రాక్షసయోగము | శ | అ | మృ | ఆ | హ | అనూ | ఉ-షా | క్లేశము |
| చరయోగము | పూ-భా | భ | ఆరు | మ | చి | జ్యే | అభి | దుర్వార్తా శ్రవణము |
| స్థిరయోగము | ఉ-భా | కృ | పున | పూ-ఫ | స్వా | మూ | శ్ర | కార్యసిద్ధి |
| వర్ధమానయోగము | రే | రో | పు | ఉ-ఫ | వి | పూ-షా | ధ | అధికలాభము |
| విషయోగము* | కృ | చి | రో | భ | అనూ | శ్ర | రే | |
| | ౫ | ౨ | ౧౫ | ౩ | ౧౩ | ౬ | ౭ | |

* విషయోగమునందలి సంఖ్యలు తిథులు. అమృతాదులయందు లేని యోగములు ఆనందాదులయందు చూడతగినవి. ఈ అమృత ఆనందాదియోగములు దైవజ్ఞవిలాస గ్రంథరీత్యా వ్రాయబడినవి.

## సమ్ముఖచంద్రుని తెలిసికొనుట

శ్లో॥ మేషే మృగేంద్రే ధనుషీందు రైంద్ర్యాం వృషేచ కన్యామృగయో రవాచ్యామ్ ।
కుంభే తులాయాం మిథునే ప్రతీచ్యాం మీనాళి కర్కాటకరాశి షూత్తరే॥

ఫలం॥ అర్థలాభం మహాత్సౌఖ్యం కురుతే సంముఖశ్శశీ।
సవ్యపార్శ్వే ద్రవ్యలాభం వామే తు ధననాశనమ్।
పృష్ఠభాగే సదా దుఃఖం కర్తోత్యేవ న సంశయః॥

ఈ చంద్రుడు సమ్ముఖమునందు కుడిభాగమునందుండగా పయనమైపోయినవారికి శుభము గలుగును. ఎడమపార్శ్వ పృష్ఠ భాగములందు అశుభ ఫలములు గలుగును.

## ప్రయాణ విషయములు

| యోగిని. | | | దిక్శూలలు. | |
|---|---|---|---|---|
| దిక్కులు. | శుక్లతిథులు. | కృష్ణ తిథులు. | తిథులు. | వారములు. |
| తూర్పు | ౧, ౧౧ | ౬ | ౧, ౬ | సో, శ |
| ఆగ్నేయం | ౩, ౧౩ | ౮ | ౩, ౧౧ | గు, శ |
| దక్షిణం | ౫, ౧౫ | ౧౦ | ౫, ౧౩ | గు |
| నైఋతి | ౪, ౧౪ | ౯ | ౪, ౧౨ | సో, శు |
| పశ్చిమం | ౬ | ౧, ౧౧ | ౬, ౧౪ | ఆ, శు |
| వాయువ్యం | ౭ | ౨, ౧౨ | ౭, ౧౫ | ఆ, మం |
| ఉత్తరం | ౨, ౧౨ | ౭ | ౨, ౧౦ | మం, బు |
| ఈశాన్యం | ౮ | ౩, ౧౩ | ౮, ౩౦ | బు |
| ఆకాశం | ౯ | ౪, ౧౪ | | |
| భూమి | ౧౦ | ౫, ౩౦ | యోగినిదిక్శూలలుండు దిక్కులలో ప్రయాణమును చేయకూడదు. | |

సోమ శనివారములు ౮ ఘడియలపైన, మంగళ బుధవారములు ౧౨ ఘడియలపైన, ఆది శుక్రవారములు ౧౫ ఘడియలపైన, గురువారము ౨౨ ఘడియలపైన వారశూల దోషము లేదు.

ప్రయాణయోగ్యతిథులు॥ ద్వితీయ, తృతీయ, పంచమి, సప్తమి, దశమి, త్రయోదశి, కృష్ణపాడ్యమి.

వారములు॥ తూర్పు - మంగళవారము, దక్షిణము - సోమ శనివారములు, పశ్చిమము - బుధ గురువారములు, ఉత్తరము - ఆది శుక్రవారములు శుభములు.

శుభనక్షత్రములు॥ అశ్వి, మృగ, పుష్య, హస్త, అనూ, మూల, శ్రవణ, ధని, రేవతులు.

శుభలగ్నములు॥ మేష, వృషభ, కటక, తుల, ధనుస్సు, మకర, మీనములు.

# గోచారఫలము

సూర్యష్షట్త్రిదశస్థిత స్త్రిదశషట్సప్తాద్యగశ్చంద్రమాః । జీవస్సప్తనవద్విపంచమగతశ్చారార్కజౌ షట్త్రిగౌ ।
సౌమ్యష్షడ్ద్విచతుర్దశాష్టమగతస్సర్వేప్యుపాంతే శుభాః । శుక్రస్సప్తమ షడ్దశర్క్షసహితశ్శార్దూలవృత్తా సకృత్ ॥

జన్మకాల చంద్రలగ్నము (లేక నామరాశి) మొదలు ద్వాదశరాసులయందు చారవశంబున రవ్యాది గ్రహములు యిచ్చెడి ఫలములు.

| రాసులు | రవి | చం | కు | బు | గు | శు | శని | రా_కే |
|---|---|---|---|---|---|---|---|---|
| ౧ | స్థానభ్రంశం | సుఖ భోజనం | ఖేదః | బంధనం | దేశభ్రంశం | ఆరోగ్యం | ఆపత్ | భయం |
| ౨ | భయం | ధనక్షయః | భాగ్యహానిః | స్వర్ణలాభః | లాభః | భోగః | హానిః | కలహః |
| ౩ | సంపత్ | ధనలాభః | భాగ్యం | పీడా | కార్యహానిః | లాభః | సంపత్ | సౌభాగ్యం |
| ౪ | మానభంగః | రోగః | శత్రుపీడా | శత్రు క్షయః | వ్యయః | అధిక సుఖం | కుక్షిరోగః | మానహానిః |
| ౫ | పీడా | కార్యహానిః | శత్రు క్షయః | దారిద్ర్యం | సంపత్ | సుతో దయః | పుత్ర క్షయః | వ్యయః |
| ౬ | శత్రునాశః | ధనం | అర్థసిద్ధిః | భూమి లాభః | క్లేశః | మానహానిః | లక్ష్మీకరం | సుఖం |
| ౭ | వ్యథా | ధనలాభః | అర్థనాశః | ఖేదః | ఆరోగ్యం | రోగః | దైన్యం | రిపుక్షయః |
| ౮ | వ్యాధిః | మృత్యు ప్రదం | శస్త్రభయం | సంతోషః | వ్యయః | వస్త్ర లాభః | మృత్యు ప్రదం | శోషణం |
| ౯ | క్రోధః | రాజక్రోధః | వ్యయః | వ్యయః | లాభః | ఆభరణం | దేహపీడా | శత్రువృద్ధిః |
| ౧౦ | కార్యసిద్ధిః | సుఖం | మనో దుఃఖం | సుఖం | పీడా | చింతా | పీడా | వ్యయః |
| ౧౧ | ధనలాభః | లాభః | ధనం | ఆనందః | సుఖం | లాభః | లాభః | శుభం |
| ౧౨ | వ్యయః | స్త్రీహానిః | క్రూరం | హానిః | వ్యయః | హానిః | నష్టం | మృత్యు ప్రదం |

రవ్యాదినవగ్రహములు ప్రతిరాశియందుండుటకు, కాలప్రమాణము చంద్రుడు ౨½ దినములు, సూర్య బుధ శుక్రులు ప్రతియొకరు ఒకనెల, అంగారకుడు ౧½ నెల, గురువు ౧ సం॥రం, రాహుకేతువులు ౧½ సంవత్సరము శని ౨½ సంవత్సరము ఒక్కొక్క రాశియందు రమారమి సంచరించెదరు.

## కుజదోషము-అందుకు పరిహారములు

కుజుడు ౨, ౪, ౭, ౮, ౧౨. ఈ స్థానములలో నుండినయెడల పురుషునకు భార్యావియోగము. స్త్రీకి భర్తృవియోగము తటస్థించును.

కటక సింహరాసులలో జన్మించినవారలకు (స్త్రీలుగాని, పురుషులుగాని) మకరరాశియందు జన్మించిన వారలకు, కుజునికి మిత్రక్షేత్రములందు జన్మించినవారలకు ఈకుజ దోషము లేదు

కుజుడు రెండవస్థానమునందుండెడి కుజదోషము మిథున కన్యలలోనుండునప్పుడు లేదు. అట్లే పంద్రెండవ స్థానము వృషభ తులలైన యెడలను కుజదోషముండదు. అట్లే నాల్గవస్థానము మేషవృశ్చికములైన ఎడలను దోషము లేదు ఏడవస్థానదోషము మకర కర్కాటకములందుండు నపుడులేదు. అష్టమదోషము ధనుర్మీనములకును గలుగదు.

కుజుడు బృహస్పతితో చేరినప్పుడును. చంద్రునితో చేరినప్పుడును కుజదోషము లేదు

పురుషులకు ౨, ౧౨ లందును స్త్రీలకు ౪, ౭ లందును ఉభయులకు అష్టమమందును కుజదోషముగలదని చెప్పదగును. (సంప్రదాయాగతము.)

వధూవరులకు పైనచెప్పినట్లు ౨, ౪, ౭, ౮, ౧౨ ఈ స్థానములలో ఉభయులకు కుజుడుండినయెడల దోషము లేదు. దీర్ఘకాలము దాంపత్య సుఖమనుభవించి పుత్రారామ ధన క్షేత్రాదులతో సుఖింతురు. ఒకరిజాతకమందే యుండిన యెడల కష్టనష్టములు కల్గును. ఇట్లని దేవకేరళమందు చెప్పబడినది.

## అమృతాదియోగములు

| నక్షత్రములు. | ఆ | సో | మం | బు | గు | శు | శ |
|---|---|---|---|---|---|---|---|
| అశ్వని | సి | సి | సి | మృ | అ | అ | సి |
| భరణి | ప్ర | సి | సి | సి | సి | సి | సి |
| కృత్తిక | సి | మృ | సి | అ | మృ | సి | అ |
| రోహిణి | సి | అ | అ | సి | మృ | మృ | అ |
| మృగశిర | సి | అ | సి | సి | మృ | సి | సి |
| ఆర్ద్రా | సి | సి | మృ | సి | మృ | సి | సి |
| పునర్వసు | సి | అ | సి | సి | అ | సి | సి |
| పుష్యమి | సి | సి | సి | సి | అ | మృ | సి |
| ఆశ్రేష | సి | సి | సి | సి | సి | మృ | మృ |
| మఖ | మృ | మృ | సి | సి | అ | మృ | అ |
| పూఫ | సి | సి | సి | అ | సి | సి | సి |
| ఉఫ | అ | సి | అ | అ | మృ | సి | మృ |
| హస్త | అ | సి | సి | మృ | సి | అ | మృ |
| చిత్త | సి | ప్ర | సి | సి | సి | సి | మృ |
| స్వాతి | సి | అ | సి | సి | అ | సి | అ |
| విశాఖ | మృ | మృ | మృ | సి | సి | సి | సి |
| అనూరాధ | మృ | సి | సి | సి | సి | సి | సి |
| జ్యేష్ఠ | మృ | సి | సి | సి | ప్ర | మృ | సి |
| మూల | అ | సి | అ | మృ | సి | అ | సి |
| పూషా | సి | ప్ర | సి | అ | సి | ప్ర | సి |
| ఉషా | అ | మృ | ప్ర | అ | సి | సి | సి |
| శ్రవణం | అ | అ | సి | సి | సి | మృ | సి |
| ధనిష్ఠ | మృ | సి | సి | ప్ర | సి | సి | సి |
| శతభిషం | సి | సి | మృ | సి | మృ | సి | అ |
| పూభా | సి | మృ | మృ | అ | సి | సి | మృ |
| ఉభా | అ | సి | అ | సి | సి | సి | సి |
| రేవతి | అ | సి | సి | మృ | సి | అ | ప్ర |

అ. — అమృతయోగము

సి. — సిద్ధయోగము

ప్ర. — ప్రబలారిష్టయోగము

మృ. — మృత్యుయోగము



ద్వితీయే భౌమదోషస్తు యుగ్మకన్యకయోర్వినా । ద్వాదశే భౌమదోషస్తు వృషతౌళికయోర్వినా । చతుర్థే భౌమదోషస్తు మేషవృశ్చికయోర్వినా । సప్తమే భౌమదోషస్తు నక్రకర్కటయోర్వినా । అష్టమే భౌమదోషస్తు ధనుర్మీనద్వయం వినా । కుంభేసింహే న దోషస్స్యాత్ప్రీత్యఖం దేవకేరళే ॥

# ఆశౌచ ప్రకరణము

శిశువు ప్రాణముతోపుట్టి నాళిచ్ఛేదనకు పూర్వమందు మరణము నొందెనేని తల్లికి పదినదిములు మృతాశౌచమున్నూ, తండ్రికి సోదరులకు మూడుదినములు జాతాశౌచము. మృతాశౌచము స్నానమాత్రముననే శుద్ధి. మృతప్రసవమైనను, నాళిచ్ఛేదనమయిన తరువాత శిశువు మరణించినను తండ్రి సోదరులకు జ్ఞాతులకు సంపూర్ణ జాతాశౌచము. మృతాశౌచము స్నానమాత్రం. తల్లికి దశరాత్ర మృతాశౌచము. పది దినములలోపల శిశువు మరణించిన యెడల జ్ఞాతులకు తల్లిదండ్రి సోదరులకు జాతాశౌచము. జననాది శేషముతో శుద్ధి. మృతాశౌచము స్నానమాత్రము. దంతజనన పర్యంతము జ్ఞాతులకు స్నానమాత్రము. చూడాకర్మపర్యంతం ఒక దినము. ఉపనయన పర్యంతము మూడు దినము లాశౌచము. వివాహమయిన స్త్రీ తండ్రియింట మరణించిన తల్లితండ్రి సోదరులు పెండ్లికాని పడుచులకు మూడు దినములు ఆశౌచము. పెండ్లియైన స్త్రీ తల్లిదండ్రుల మరణమునందు దశరాత్రములోగా త్రిరాత్రాశౌచము పట్టవలెను. సోదరీ సోదరులకు సన్నిధానా సన్నిధానములయందు త్రిరాత్రాశౌచము. మాతామహ మాతామహీలు పినతల్లి పెత్తల్లులు మేనమామ మేనత్త దౌహిత్రుడు మేనల్లుడు పినతల్లి పెత్తల్లి బిడ్డలకు మేనత్త మేనమామ బిడ్డలకు పురుషపర్యాయములో సన్నిధానమందు త్రిరాత్రము. గ్రామాంతరమునందు పక్షిణి. పక్షిణీకాలాతిక్రమణమందు గ్రామాంతరమువింటే పగలయితే ఆపగలు, రాత్రి అయితే ఆ రాత్రి ఉండి స్నానం. మేనమామ భార్యకు సన్నిధానములో స్నానము. భార్యవుండగా సంతానం వుండగా అత్తమామలు మరణించినయెడల సన్నిధానమందు మూడు దినములు. అసన్నిధానమందు పక్షిణి. భార్య, సంతానము లేనియెడల సామీప్యమున నొకరాత్రి. అసన్నిధానమందు స్నానం. సవతితల్లి సోదరీ సోదరులు మరణించినపుడు సమీపమునందు ఒకదినము. దేశాంతరమందు స్నానమాత్రం. సవతికూతురు మరణించినపుడు సవతితల్లి కొకదినము. సవతితల్లిపోయినపుడు సవతికూతురి కొకదినము ఆశౌచము. దూరమందైనయెడల స్నానముతో సరి. అల్లుని మరణము సమీపమునందు జరిగినయెడల అత్తమామలకు మూడుదినములు. గ్రామాంతరమందు పక్షిణి. జ్ఞాతులకు దశాహానంతరమందు మూడు మాసములవరకు మూడుదినములు. ఆరుమాసములవరకు పక్షిణి. సంవత్సరపర్యంతం ఒకరాత్రి ఆశౌచము. మహానది అడ్డమున్నయెడల అతిక్రాంతాశౌచములేదు. త్రిరాత్రజ్ఞాతులకు త్రిరాత్రాతిక్రమణమందు స్నానమాత్రమే.

తల్లిదండ్రులు చనిపోయినపుడు వారికి ప్రేతక్రియలు జరగని యెడల తాము బ్రతికియుండు కాలములో నెన్నడు విన్నను ౧౦ దినములు ఆశౌచము. ప్రేతకృత్యములు జరిగినయెడల ౧౨ సంవత్సరములలో నెప్పుడు విన్నను ౧౦ దినములు ఆశౌచము. అనేకాశౌచ సన్నిపాతమందు దశరాత్రమృతాశౌచము జరుగుచుండగా దశరాత్రమృతముగాని త్రిరాత్రమృతముగాని సంభవించెనేని ప్రథమాశౌచముచే నివృత్తి. దశరాత్రజాతాశౌచము జరుగుచుండగా త్రిరాత్రమృతాశౌచము వచ్చినను జాతాశౌచముచే నివృత్తిగాని మృతాశౌచముచే అధిక జాతాశౌచము పోదు. దశరాత్రమృతాశౌచము మధ్య దశరాత్ర జాతాశౌచము వచ్చినను దశరాత్ర జాతాశౌచము మధ్య దశరాత్రమృతాశౌచము వచ్చినను మృతాశౌచముచేతనే నివృత్తి. దశరాత్రమృతాశౌచము నవలంబించియుండగా దశమదినమున రాత్రి వేరొక మృతాశౌచము వచ్చినయెడల మొదటి యాశౌచము పూర్తియైన పిమ్మట అనగా పదియవరాత్రి ౪ వ యామమందు వినిన ౨ దినములు మృతాశౌచము పట్టవలెను. చరమదినాష్టమయామ మనగా సూర్యోదయాత్పూర్వమున వేరొక పూర్ణమృతిని వినిన ౩ దినము లాశౌచము. పుత్ర పుత్రికా జనన సంబంధియగు జాతాశౌచ మవలంబించియుండగా వేరొక మృతాశౌచము వచ్చినను మృతాశౌచము వదలి జాతాశౌచమునే పట్టవలెను.



హైమోర్ధ్వపుండ్రమజహన్మకుటం సునాసం మన్దస్మితం మకరకుణ్డలచారుగణ్డమ్ ।
బిమ్బాధరం బహులదీర్ఘ కృపాకటాక్షం శ్రీవేఙ్కటేశముఖమాత్మని సన్నిధత్తామ్ ॥

## న వ గ్ర హ శా ం తి

**సూర్యునకు** :—పరమశివుని పూజించినను, సూర్య నమస్కారముచేసినను, ఎర్ర పుష్పంలచే పూజించినను, ఎర్రగుర్ద మాణిక్యము ధరించినను, ఎర్రఆవు లేక గోధుమదానముచేసినను దోషనివృత్తి.

**చంద్రునికి** :— అమ్మవారిపూజచేసినను, శ్వేతపుష్పములచే పూజించినను, శ్వేతవస్త్రము ముత్యములు, వీటిని ధరించినను, శంఖము లేక బియ్యము వీటిని దానము చేసినను దోషనివృత్తి.

**కుజునికి** :— సుబ్రహ్మణ్యుని లేక కాళిని పూజించినను, రక్తవస్త్రము, పగడములు ధరించినను, ఎర్రయెద్దు లేక కందులు వీటిని దానముచేసినను దోషనివృత్తి.

**బుధునికి**:— రామాది విష్ణ్వవతారమూర్తుల పూజించినను, పీతాంబరము మరకతము వీటిని ధరించినను, సువర్ణము లేక పెసలు వీటిని దానముచేసినను దోషనివృత్తి.

**గురువునకు**:—దక్షిణామూర్తిని పూజించినను, పుష్యరాగము ధరించినను, పసుపు వస్త్రము లేక శెనగలు వీటిని దానముచేసినను దోషనివృత్తి.

**శుక్రునికి** :— పార్వతిని లేక లక్ష్మిని పూజించినను, శ్వేతవస్త్రము వజ్రము ధరించినను, వెండి తెల్లటి గుఱ్ఱము అనుములు వీటిని దానముచేసినను దోషనివృత్తి.

**శనికి**:— శాస్తను పూజించినను, నల్లవస్త్రము ఇంద్రనీలమును ధరించినను, నల్ల ఆవు లేక నూగులు వీటిని దానముచేసినను దోషనివృత్తి.

**రాహువునకు**:—దుర్గను పూజించినను, గోమేధికమును ధరించినను, కత్తి లేక ఇనుము ఉద్దులు, (మినుములు) వీటిని దానము చేసినను దోషనివృత్తి.

**కేతువునకు** :— గణపతిని పూజించినను, వైఢూర్యము ధరించినను, దానిని దానముచేసినను, ఉలవలు దానముచేసినను దోషనివృత్తి.

## నక్షత్రజనితరోగవృత్తి దినములు

| | | | | | |
|---|---|---|---|---|---|
| అశ్వినీనక్షత్రమున | ౭ | దినములు పీడించును | పూర్వాషాఢానక్షత్రమున | ౧౫ | దినములు పీడించును |
| కృత్తిక | ౭ | ,, | ఉత్తరాషాఢా | ౨౦ | ,, |
| రోహిణి | ౩ | ,, | శ్రవణం | ౧౦ | ,, |
| మృగశిర | ౫ | ,, | ధనిష్ఠ | ౧౫ | ,, |
| పునర్వసూ } పుష్యమీ } | ౪ | ,, | శతభిషము | ౨౦ | ,, |
| అశ్లేష | ౭ | ,, | ఉత్తరాభాద్రా | ౩౦ | ,, |
| పుబ్బ | ౨ | ,, | రేవతి | ౧౦ | ,, |
| ఉత్తర | ౫ | ,, | భరణి | } కష్టముసంభవింపగూడును | |
| చిత్త | ౮౫ | ,, | ఆర్ద్రా | } | |
| స్వాతి | ౬౦ | ,, | మఘ | } | |
| విశాఖ | ౨౦ | ,, | హస్త | } | |
| అనూరాధ | ౧౫ | ,, | మూల | } | |
| జ్యేష్ఠ | ౧౫ | ,, | పూర్వాభాద్రా | } | |

ఏ యే నక్షత్రమునందు రోగాప్పదమౌనో ఆ నక్షత్రాధిపతులగు గ్రహములకు జపహోమతర్పణ దానార్చనాదులుచేయ శాంతించి గుణమౌను.

## నక్షత్రశూలలు

శ్లో॥ పూర్వే జ్యేష్ఠాధనిష్ఠే చ శ్రోణాశ్విన్యా చ దక్షిణే । పశ్చిమే పుష్యరోహిణ్యావుత్తరే హస్త ఫల్గునీ । ఏతన్నక్షత్రశూలాను యాత్రా న పునరాగమః ॥

తా॥ జ్యేష్ఠ ధనిష్ఠ తూర్పుదిక్కునకును, శ్రవణాశ్వినులు దక్షిణదిక్కునకును, పుష్యమీరోహిణులు పశ్చిమదిక్కునకును, హస్త పుబ్బ ఉత్తరలు ఉత్తరదిక్కునకును శూలసంజ్ఞలు గలవి. కనుక ఈ నక్షత్ర శూలలలో ప్రయాణముచేసినవారు తిరిగిరారు అని తాత్పర్యము. వీనికి శాంతులు :—

శ్లో॥ నక్షత్రశూలాశాంత్యర్థం దధి తైలం గుడం తథా। పాయసం చ ప్రదాతవ్యం దిక్షు ప్రాగాదిషు క్రమాత్ ॥

తా॥ తూర్పుదిక్కునందు శూలలుగల నక్షత్రములకు పెరుగును, దక్షిణదిక్కునందు శూలలుగల నక్షత్రములకు తైలమును, పశ్చిమదిక్కునందు శూలలుగల నక్షత్రములకు బెల్లమును, ఉత్తరదిక్కునందు శూలలు గల నక్షత్రములకు క్షీరాన్నమును దానముచేయవలెను.

### ప్రయాణమందు గమనించతగిన తిథివిషయము

శ్లో॥ ద్వితీయా చ తృతీయా చ పంచమీ సప్తమీ తథా। దశమ్యేకాదశీ చైవ యాత్రాసిద్ధిం త్రయోదశీ ॥
కృష్ణే వా యది వా శుక్లే వర్జనీయా చతుర్దశీ। పౌర్ణమా స్యామమాయాం చ న గంతవ్యం కదాచన ॥

తా॥ కృష్ణపక్షమునందును, శుక్లపక్షమునందును విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి, ఏకాదశి, త్రయోదశి అను యీతిథులు కార్యసిద్ధిని గలిగించును. శుక్లకృష్ణపక్షములయందు చతుర్దశిని విడువ వలయును. పూర్ణిమ, అమావాస్య తిథులలో ఎప్పుడును ప్రయాణము చేయరాదు

### శ్రీ సౌమ్యనామ సంవత్సర వ్రతదినముల పట్టిక.

| 1969—70 | | శు 11 | కృ 11 | ● అమా | కృత్తిక | శ్రవణం | షష్ఠి | శుక్ల-ప్ర | కృ-ప్ర | మాస-శి | పునర్వ. |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1969 మార్చి | .... | 29 | | | 22 | | 24 | 31 | | | 27 |
| ఏప్రెల్ | .. | 28 | 13* | 16 | 19 | 11 | 22 | 30 | 14 | 15 | 23 |
| మే | .... | 27 | 12 | 15 | 16 | 8 | 22 | 29 | 13 | 14 | 21 |
| జూన్ | .... | 26 | 10 | 14 | 12 | 5 | 21 | 28 | 12 | 13 | 17 |
| జూలై | .... | 25 | 10 | 14 | 10 | 2 | 20 | 27 | 11 | 12 | 14 |
| ఆగస్టు | .... | 24* | 8 | 12 | 6 | 30 | 19 | 25 | 10 | 11 | 11 |
| సెప్టెంబరు | .... | 22 | 7 | 11 | 2,29 | 22 | 17 | 23 | 9 | 10 | 7 |
| అక్టోబరు | .... | 21 | 7 | 11 | 27 | 19 | 16 | 23 | 8 | 9 | 4,31 |
| నవంబరు | .... | 20 | 5 | 9 | 23 | 16 | 15 | 22 | 7 | 8 | 28 |
| డిశంబరు | .... | 19 | 5 | 9 | 20 | 13 | 14 | 22 | 7 | 8 | 25 |
| 1970 జనవరి | .... | 18 | 4 | 7 | 17 | 9 | 13 | 19 | 5 | 6 | 21 |
| ఫిబ్రవరి | .... | 17* | 2 | 6 | 13 | 6 | 11 | 18 | 3 | 4 | 18 |
| మార్చి | .... | 18 | 4 | 7 | 12 | 5 | 13 | 20 | 5 | 6 | 17 |
| ఏప్రెల్ | .... | | 2 | 5 | | 1 | | | 3 | 4 | |

* ఈ గుర్తుగల తేదీలకు ముందు దినము స్మార్తైకాదశి.

| ఇంగ్లీషు | అరవం | గ్రహగతులు | శ్రీ సౌమ్యనామ సంవత్సర ఉత్తరాయణ వసంతర్తు చైత్రమాస శుక్లపక్ష తిథివారాదయః శాలిశకాబ్దాః ౧౮౯౧ కలిగతాబ్దాః ౫౦౭౦ ఇంగ్లీష్ 1969 ఫసలీ ౧౩౭౮ |
|---|---|---|---|
| 19 | ౬ | | బు॥ శు-ప్రతి ౮-౨౬ ఉ-భా ౬-౫౩ బ్రా ౫౬-౪౬ బవ-౨౬ రావ 9-13 సమాహః30-౦ చాంద్రమాన శ్రాద్ధః శ్వేతవరాహకల్పః తైలాభ్యంగః నింబకుసుమభక్షణం ప్రపాదానం వసంత నవరాత్రారంభః శ్రీవారి నిత్యోత్సవారంభః సంవత్సరాది ఆస్థానం చంద్రోదయః దక్షిణశృంగః శో 3-౨౪ |
| 20 | ౭ | బు ర | గు॥ ద్వి ౮-౩౬ రే ౮-౩౫ ఐం ౫౪-౫౭ కౌల-౩౬ శత ౧బుః ౫-3 త్యాజ్యాభావః ఉ-భా ౨ రవిః ౪౮-౫౩ ఉత్తమ మన్వాదిః మేషాయనం శో 3-౧౬ |
| 21 | ౮ | | శు॥ తృ ౯-౫౯ అశ్వ ౧౨-౧ వై౫౩-౫౯ గ ౯-౫౯ ఉ-భా ౧రాః ఉ-ఫ 3 కేః 33 ఉవ6-45 శ్రీకోదండరామస్వామివారి గరుడోత్సవః ఆందోళనతృతీయ శో 3-౮ |
| 22 | ౯ | బు | శ॥ చ ౧౨-౨౭ భ౧౫-౪౦విష్కు౫౩-౪౧భ౧౨-౨౭ రావ 1-15 అహః30-౮మత్స్య జయంతి శత ౨ బుః 3-౮ శో 3-౦ |
| 23 | ౧౦ | శు | ఆ॥ పం ౧౫-౫౧ కృ ౨౦-౧౪ ప్రీ ౫౪-౯ బా ౧౫-౫౧ వర్జ్యంలేదు. షష్ఠీతిథిః రేవతి 3 వక్రీశుః ౧౮ లక్ష్మీపంచమి కూర్మకల్పః శో ౨-౫౨ |
| 24 | ౧౧ | బు ర | సో॥ షష్ఠి ౧౯-౫౫రో౨౫-౪౨ఆయు౫౪ ౫౭ తై౧౯-౫౫ ఉవ7-38 ఉ-భా 3 విః ౧౦-3౧శూన్యతిథిః శత3బుః౨౭ శ్రీకోదండ రామస్వామివారి రథోత్సవం శో౨-౪౪ |
| 25 | ౧౨ | | మం॥ సప్త ౨౪-౨౯ మృగ3౧-3౭ సౌ౫౫-౫౭ తైవ3-57అహః3౦-౪సప్తమీతిథిః శ్రీకోదండ రామస్వామి అవభృథోత్సవః శో ౨-3౬ |
| 26 | ౧౩ | శు బు | బు॥ అ ౨౯-౧౧ ఆర్ద్ర 3౭-౪౦ శో ౫౭-౫ బ౨౯-౧౧ వర్జ్యంలేదు శ్రీశాలవాచ్చియార్ ఉత్సవారంభః అశోకాష్టమి భవాన్యుత్పత్తిః జ్యేష్ఠ౨కుః3శత౪బు౫౫అనధ్యాయః శో౨ ౨౮ |
| 27 | ౧౪ | గ | గు॥ న 33-౫౦ పున ౪3-3౭ అతి౫౭-౫౭ బ౧-3౦ పవ 10-19 ఉ-భా౪ రః ౩౨-౪౦ శ్రీరామనవమి ఆస్థానం శో ౨-౨౧ |
| 28 | ౧౫ | బు | శు॥ ద 3౮-౧ పుష్య ౪౯-౭ సు ౫౦-3౪ తై ౫-౫౫ ఉవ 8-13 అహః 30-౨౨ పూ-భా౧బుః౭ధర్మరాజదశమి శో ౨-౧౨ [పూ-భా ౨బుః౫౫ శో ౨-౪ |
| 29 | ౧౬ | బు | శ॥ ఏ ౪౧-3౭ ఆశ్రే ౫౪-౧ ధృ ౫౮-3౫ వ ౯-౪౯ పవ 3-32 సర్వోపవాసః |
| 30 | ౧౭ | శు ర | ఆ॥ ద్వా ౪౪-౧౯ మఘ ౫౮-3 శూ ౫౭-౪౨ బ౧౨-౫౮ సావ 4-26 రేవ౧ రవిః ౫౫ 3౫ రేవరవక్రీశుః౪ వామనద్వాదశి దమనోత్సవః శో ౧-౫౬ |
| 31 | ౧౮ | బు గు | సో॥ త్రయో ౪౬-౧ పుబ్బ ౬౦-౦౦ గం ౫౬-౧౮ కౌ ౧౫-౧౦ పవ 1-36 అహః 30-౨౮ పూ-భా 3బుః౫-౫ ఉ-ఫ 3 గుః౫౨ అనంగత్రయోదశి శో౧-౪౮ |
| 1 | ౧౯ | శ | మం॥ చతు ౪౬-౨౪ పుబ్బ౦-౪౫వృ౫3-౪౯ గ ౧౬-౧౨పవ 1-43పంగున్యుత్తరం శ్రీశాలవాచ్చియార్ శాత్తుమొరవశ్చాదుదితశనిః అనధ్యాయత్రయం శో ౧-౪౦ |
| 2 | ౨౦ | బు | బు॥ ◯పౌ ౪౫-3౮ ఉత్త ౨-౨౯ ధ్రు ౫౦-౧౫ భ ౧౬-౧ పవ 3-27 మదనపూర్ణిమ రౌచ్య మన్వాదిః పూ-భా ౪ బుః 30 అన్వాధానం శ్రీగోవిందరాజస్వామివారి పూలంగి శ్రీతుంబురుతీర్థ ముక్కోటిః శో౧-3౨ |

మార్చి నెల 1969

పంగుని నెల (మీనమాసః)

ఏప్రిల్ నెల

| | | | |
|---|---|---|---|
| ర శు రా బు | శ | | |
| | శు ౧౫ లకు భ చక్రం | | |
| | | | |
| | కు | | చ కే గ |

